

విజయనగరంలో హిందీ ప్రేమీ మండలి ఆధ్వర్యమున జరుగుచున్న ప్రభుత్వ
ప్రణాళికా హిందీ తరగతుల సమావర్తనోత్సవ చిత్రం. ఇందు విద్యార్థులు,
విద్యాలయ అధ్యాపకులు, ప్రేమీ మండలి కార్యవర్గ సభ్యులు గలరు.

[illegible]: 20౮౮ [illegible] హిందీసంఘ్

సంపుటి 7 సంచిక 7

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

*



*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

959 ఖైరతాబాదు, హైదరాబాదు - 4

| సంవత్సర చందా | అక్టోబరు | విడిప్రతి |
|---|---|---|
| రు. 4-00 | 1960 | 35 నయాపైసలు |

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో

## సంపాదకీయం

ఆదర్శం గల వ్యక్తులంటే గౌరవం చూపాలన్న తలంపు ప్రతి వ్యక్తికీ ఉంటుంది. ఎందుచేత ? ఆదర్శం, పరచింతన ఇది ఖచ్చితంగా విభజించి స్పష్టంగా చూడరాక మానవునిలో దాగియున్న ఏదో ఒక అంతశ్శక్తి స్వార్థానికి వెలిగా ఉండుట అనే సత్సంకల్పం దీనిలో ఉంది. ధర్మరాజు చెప్పిన పరపీడన, నిరసన సిద్ధాంతము కృష్ణుని అనాసక్తి యోగము, బుద్ధుడు బోధించిన సమ్యక్కర్మ, సమ్యగ్వాక్కు, సమ్యగాచరణ మొదలైన అష్టాంగికాల సద్భావనలు కూడా ఈ ఆదర్శంలోనే ఉన్నవి. ఈ ఆదర్శాన్ని ఒక్క చేష్టతోగానీ ఏ ఒక్క ఘటనతోగానీ, కలిపి, లేక విడదీసి చూపించలేము. ఇది మానవ జీవితమంతటా క్రమ్మి ఉన్న ఆర్తి వ్యక్తితపన. ఇంకా మనం ప్రపంచానికి ఏమీ చేయలేక పోతిమే అన్న ఆతురత. నిజానికి మానవుడు జీవితంలో ఎంత చేయగలడు ? ఎంత చేయగలడు ఎంత చేశాడు అన్నది అసలు ప్రశ్న కాదు. ఈ ప్రశ్నకు వచ్చే సమాధానంతోనే వ్యక్తిని కొలువలేము. వ్యక్తి జనం ఏమైనా వ్యక్తి, తన ఆయుః పరిమితిలో కొంతే చేయగలడు అందువల్ల ఎంత త్యాగం చేసినా, ఎంత ఆహుతి ఐనా ఇంకా చేయలేదన్న ఆకాంక్ష లోకానికి మిగులుతూనే ఉంటుంది. పోతే లోకం చివరకు చూచేదేమిటి ? ఎంత చేశాడు, చేయలేదు అని కాదు. ఎంత చేయాలని అతని మనస్సులో ఉంది. ఆ చేయడానికి అతను తపిస్తున్నాడా లేదా అని ఇదే కావాలిసింది కూడా. ఆ తపన ఉన్న వ్యక్తి ఆదర్శ వ్యక్తి. స్వర్గీయులైన ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారిని చూస్తే మనకీ విషయం బోధపడుతుంది. ఆయన ఖద్దరు కట్టి, దంపుడు బియ్యం తిని నిరాడంబరమైన జీవితాన్ని గడిపారు ఇలా ఆయన ఎందుకు చేశారు ఇట్లా చేశారు అన్న పరిణామం మన కవసరం లేదు. ఇట్లా ఎందుకు చేశారు ? ఆ చేయడంలో గల ఉద్దేశ్యమేమిటి ? అన్నదే మనకు కావలసింది. ఆ ఉద్దేశ్యం స్వార్ధ జనితమైందిఅయితే నిజంగా అది అపరిశుద్ధమైందే. కాని దాంట్లో ఆయనకు తెలియకుండానే ఏదో అమూల్యమైన ఒక సత్ప్రేరణా శక్తి ఉంటే తప్పకుండా అది పరిశుద్ధమైంది. అందువల్లే మహాత్ముడు సాధ్యంలో పవిత్రతతో పాటు సాధనంలో కూడా పవిత్రత ఉండాలన్నాడు. ఈ సాధన పవిత్రతకు

బీజభూతమైంది ఊహా పవిత్రత. అంటే మన ఊహ సత్ప్రయోజన సంబద్ధమై ఉండాలన్న మాట. కొందరు ఎందుకో డబ్బు గడిస్తారు. అది చెడుదని కాదు. అది వాళ్ళ విద్యుక్త ధర్మం, డబ్బు డబ్బు కోసమే అయితే ఆ ఊహ నిజంగా చెడుదే. అలా కాక ఆ డబ్బు ఇంకో దానికి అనీ, కేవలం అది సాధనం గాని సాధ్యం మాత్రం కాదు అనీ అనుకోగలిగినవాడు ఆదర్శ మూర్తి. అందువల్లే కాబోలు బహుశా లక్ష్మీనారాయణ చౌదరిగారిని "ఆంధ్ర బజాజ్" అన్నారు.

అందువల్లే ఆయన ఇల్లు గాంధేయులకు నిత్య సంతర్పణ మందిరమైంది. అందువల్లే ఆయన సర్వోదయులకు అంతస్సూత్రధార పేటి అయినాడు. మనం మన ప్రాచీనగ్రంథాల్లో ధార్మిక గృహమేధుల్ని చూచాం. జాతీయ గృహమేధుల్ని చూడలేదు. లక్ష్మీనారాయణ చౌదరిగారు ఉండగా ఒక్కసారైనా ఆయన ఇంటికి వెళ్ళి ఆయన నుంచి ఆతిథ్యం పొందినవారు మాత్రం ఓహో జాతీయ గృహమేధి అంటే వీరు కాబోలు అనుకుని ఉండే ఉంటారు. లక్ష్మీనారాయణ చౌదరి గారి వ్యక్తిత్వం జాతీయమైంది. ఆయన వస్త్రధారణ చూస్తేనా, ఆయన డబ్బూ అన్నీ జాతీయంగానే కనిపించేవి. కోపం వచ్చిందా రుద్రుడై కనిపించేవాడు. మరల అంతలోనే శాంతించి మెత్తగిలి పోయేవాడు అని ఎర్నేని సుబ్రహ్మణ్యంగారన్న మాటలు చూస్తే గాంధేయుల అహింసమాటున ఉన్న నియమకాఠిన్యం ఆయనలో కూడా ఉండేదేమో ననిపిస్తుంది. వీటితోపాటు ఇంకా ఎన్నో నియమనిష్ఠలు, గుణగణాలు, సత్సంప్రదాయాలూ లక్ష్మీనారాయణ చౌదరిగారిలో ఉన్నాయి. దక్షిణభారత హిందీ ప్రచార సభకు ఆగ్రమను చిరకాలంగా కోశాధ్యక్షులుగా ఉండి ఎనలేని సేవ చేశారు. హిందీ ప్రచార సభాధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చౌదరిగారి మృతికి సానుభూతిని తెలుపుతూ అన్న మాటలు "నిర్మాణ కార్యక్రమంలో ఆసక్తి కలిగియున్న ఒక విశుద్ధ వ్యక్తి తన మహోన్నతశీలాన్ని, అనుభవ ప్రాబల్యాన్ని ఇక మనకు లేకుండా చేసి దివంగతులైనందులకు విచారిస్తున్నాను"- చౌదరి గారి ఆత్మకు పరమాత్ముడు శాంతి నొసంగు గాక.

---

**కవిత:**

# అభ్యర్థనము

— శ్రీ టి. వి. ఎమ్. అయ్యవారు

(సుకుమార కిసలయభరితమైన తన్ను చేతులార నరకే నిర్ద**యునితో**, ఒక మాకంద మహీజము పెట్టుకొన్న మొర.)

ఓయి ! నిర్దయహృదయ ! మహోగ్రనిశిత
పరశుధారాహతుల — స్వాదురసమధు ఝ
రీ నిబిడము నా సౌందర్య రేఖనెల్ల
ఆహరించెద వేమి ?— యీ అవసరమున.
నా కుటిలసీలపత్ర సంతాన బంధు
ర ప్రబంధాంతరముల నర్తనము సలిపె
రసఘునీ బాలలైన శర సృమృగాంక
రేఖికలు — నిశాథమ్మిల్ల మృదుల వికచ
మల్లికా దామములు — మంద మంద గతుల
నా విశాల శాఖాపరిణాహ నీలి
మమ్మె — బాహ్యప్రపంచ సమ్మర్దగళిత
సుఖులు — ప్రేయసీ ప్రియులకు చూఱనిచ్చె
అమర సౌఖ్యమ్ము — ననురక్తమగు నెడంద.
మత్పురాణచ్ఛదమ్ములు — మఱపురాని
ఎందదెందమౌ ప్రణయ నిష్యంద మధుర
శపథ మధుగిరాంవీథి — సాక్ష్యమ్ములగును
మర్మరా రావముల శీతమారుతహతి.

ఈ రసాస్థానవాటిక — నేలఁ గూల
పెట్టెదకట — అసంవదుర్భిక్షమైన
జగతినెట్లు జీవింపగ చనెదు — నన్ను
తాకకుము — బాష్పభర నమోవాకమిడెద.



వ్యాసము

# పాల్కురికి సోమనాథుని గద్య రచనలు

— శ్రీ ఎం. కులశేఖరరావు

శైవ మతమునే ప్రధానముగా దృష్టియందుంచుకొని గ్రంథ రచన చేసిన పాల్కురికి సోమనాథుడు, బసవ పురాణ పండితారాధ్య చరిత్రము అను ద్విపద కావ్యములనే కాక కొన్ని గద్య కృతులను కూడ రచించెను. ఈతడు రచించిన యీ గద్య కృతులు నాలుగు లభ్యములైనవి. అవి ఇవి: 1. పంచప్రకార గద్య, 2. నమస్కార గద్య, 3. అక్షరాంక గద్య, 4. అష్టోత్తర శతనామగద్య. ఈ నాలుగు గద్యలలో నుపయోగింప బడిన భాషను, శైలిని బట్టి యవి తెలుగు వచనముతో నెట్టి సంబంధమును కలిగియున్నవి యను విషయము పరిశీలింప దగియున్నది,

1. పంచ ప్రకార గద్య: ఇది పేరునకు దగినట్లుగనే ఐదు విధముల గద్యలకు సంకలనము. ప్రథమమున నీ గద్య మీ శ్లోకముతో ప్రారంభ మగును.

స్వస్తి శ్రీ ప్రమథాన్వయోత్తమ శిలాద శ్రీ మునీంద్రాత్మజః
శ్రీకంఠ ప్రతిబింబమూర్తి రసమ శ్రీనంది నాథోఽపియః
తస్యాంశోద్భవ. దండనాథ, బసవ శ్రీ నామధేయ ప్రభో,
తత్కారుణ్య తరంగితం మయిసదా నిక్షిప్యతాం వీక్షణం.

ఈ సంస్కృత శ్లోకము తరువాత నీ గద్యభాగము కలదు.

'జయ జయ బసవ! శ్రీమహావృషభేంద్రావతార! సముంచిత వీర మాహేశ్వరాచార! ప్రమథగణాలంకార! జగత్రయాధార, దేవ, బసవా!

నిరాకుల నిరర్గళ నిరతిశయ నిజభక్తి తాత్పర్యశరణగణ చరణార విందమకరంద ధారాభిషేక సంగత మంగళాలంకార విరచి తోత్తమాంగ అనవరత సుఖానుషంగ! జ్ఞాన వైరాగ్యైశ్వర్య విభ్రాజిత గుణోత్తుంగ! సకలలోక ప్రసారిత కీర్తికాంతా భుజంగ! దేవ! బసవా!

అనర్గళజ్ఞాన దుర్గాంతర్గత మార్గ భ్రష్ట నికృష్ట నానాయోని పరిపీడిత
[illegible] జైన బౌద్ధ చార్వాక మాయావాద దుష్ట

మృగవిసర విశసననోవిద వివిధ లబ్ధకాయమాన విక్రమోద్దండ! శివసమయ పరిపాలన ప్రచండ! అణిమాద్యష్టగుణ మణిగణ కరండ ఖండిత కందర్ప కోదండ వేష! బసవా!'

ఇటువంటి ఎనిమిది గద్యలు ప్రథమ ప్రకారమున నున్నవి. ఇందు గణనియమమేదియును లేదు. నిశ్ఛందముగానే యున్నవి. ఇందు 'బసవా' అను అంత్య పదమొకటి మాత్రము తెలుగు సంబోధన ప్రథమావిభక్తిగా నున్నది. తక్కిన వాక్య రచన మంతయు సంస్కృతమయమే. అంతమున తెలుగు భక్తితో నొక పదమున్నంత మాత్రమున నిది సంస్కృతము కాదని చెప్ప వీలులేదు. తెలుగు భాషయందుండు వాక్య నిర్మాణ పద్ధతి దీని యందు కానరాదు.

రెండవ విధము :

అపిచ శ్రీ మహిమోన్నత విభవా! భవపాశోత్కర శాతలవిత్రా!
విత్రాసిత దిగ్గజ ధరణీశా! ధరణీశప్రకార్చిత చరణా!
చరణద్యుతి కోసలజపద్మా! పద్మభవప్రముఖామర వినుతా!
నుతగాంధర్వ స్ఫురితాసాంగా! అంగానంగ వికారవిరహితా!
హిత శివయోగానంద సుఖాశ్రమ! ఆశ్రమ ధర్మా ధర్మవివర్జిత!
జితమద విద్వాల మానుషజన్మా! జన్మజరామరణాదివిదూరా!
దూరనిరాకృత భవసంసర్గా! సర్గస్థితిలయపాలనచరితా!
చరితార్థాఖిల జంగమభక్తా! భక్తజనాంతఃకరణనియుక్తా-దేవ! బసవా!

ఇందు పదునారు చరణము లున్నవి. ప్రతి చరణమున నాలుగేసి మాత్రలుగల నాలుగు గణములు కలవు. ముక్తపదగ్రస్తమను శబ్దాలంకారము ప్రతిచరణమున పాటింపబడినది. ఈ నియమములు సమానముగా నన్ని చరణములందు పాటింపబడుటచేత కవి యొక విశేషచ్ఛందమును పాటించినాడనవలసి యున్నది. అందుచే గద్యమను పేరున్నను నిశ్ఛందము కాదు. ఛందోబద్ధమగు దానిని వచన విభాగమున చేర్చుట తగదు కదా!

మూడవ ప్రకారము :

'జయజయ నిరవధి నిర్మలగాత్రా-జయజయ దురితలతాచయదాత్రా,
జయజయ కేవల భక్తికళత్రా-జయజయ భావాతీత చరిత్రా,
జయజయ శాస్త్రాచారాధారా-జయజయ చారుపురాతన చర్యా,

జయజయ శరణగణాలంకారా - జయజయ పరమవ్యోమవిహారా,
జయజయ భక్తపదాంబుజభృంగా—జయజయ మంగళ మహిమోత్తుంగా,

ఈ 'ప్రకారమున' మొత్తము 31 చరణము లున్నవి. అంత్యచరణము 'దేవబసవా!' యను సంబోధనతో సమాప్తమగును. ఇందుకూడ ప్రతిపాదమున నాలుగు మాత్రలుగల నాలుగు గణము లున్నవి. అంత్యానుప్రాస మను శబ్దాలంకార మున్నది. ఒక ప్రత్యేక పద్ధతిని గణనియమ ముండుటచే నిదియు ఛందోబద్ధమనుటకు సందియము లేదు. దీనిని కూడ వచన విభాగమున చేర్చుటకు వీలులేదు.

నాల్గవ ప్రకారము :

"జయదురిత పరిహారణ, జయసుకృత పరిచరణ, జయనిర్మల రవికరణ
జయసుకవినుతి కలిత, జయపిరిచ సుఖలలిత, జయవినయమిళిత,
............... దేవ! బసవా!

ఇందు మొత్తము పన్నెండు పాదములున్నవి. ప్రతిచరణమున నయిదేసి మాత్రలుగల రెండుగణములు ఉన్నవి. ఎచటను దీర్ఘాక్షరము ఉపయుక్తము కాలేదు. కేవలము లఘువులు, హ్రస్వాక్షరములే కలవు. అనుప్రాస మను శబ్దాలంకారమును పాటించినాడు. ఇట్టిగణ నియమముండుటచే నిదియు వచనమన చెల్లదు.

అయిదవ ప్రకారము :

"జయశివరంజన - జయభవభంజన - జయకరుణాకర - జయపరభీకర,
జయబుధభావన - జయశ్రితపోషణ - జయగుణరాజిత - జయగణపూజిత
జయ జయ శ్రీ బసవనాథ! నమస్తే, నమస్తేనమః"

ఇందు ఒక విభక్తిప్రత్యయము కూడ తెలుగు కాదు. ఈ రచనమును తెలుగనుటకే వీలులేదు. దీనిలో ఎనిమిది చరణములు ప్రతిదానిలో నాల్గు మాత్రలుగల గణములు రెంటితో కూర్చినవి-కలవు. అంత్యప్రాస మున్నది. ఇదికూడ తెలుగు వచనముతో నిస్సంబంధకమే.

2 నమస్కార గద్య : ఇది బసవస్తుతితో కూడిన కృతి. శ్లోకముతో నిట్లు ప్రారంభమైనది.

"శ్రీకంఠోద్భవ వేదచోదితల సద్వీరవ్రత ప్రక్రియా
చార్యాదేశక దేశికాయ భువనస్తు త్యాయ నిత్యాయన

బంధించిన వాక్యనిర్మాణ పద్ధతికాని, చివరకు విభక్తిప్రత్యయములు కాని యుపయోగింపబడలేదు. దీని నాంధ్రవచన వాఙ్మయమున చేర్చుటకు వీలు లేదు.

3. అక్షరాంక గద్యము : ఈ గద్యపాద ప్రథమాక్షరములు అకారము మొదలు క్షకారము వరకు కూర్చబడుటచే దీనికీ పేరు కలిగినది. ఇందు అక్షరాంక పద్యములు కూడ కలవు. సంస్కృతమున నున్న పరమేశ్వర మాతృకామాలాస్తోత్రములవంటి రచనలు దీనికి మార్గదర్శకములై యుండ వచ్చును. అక్షరాంక గద్య ప్రారంభ మొక మాలినీ వృత్తమున నున్నది.

"జయ జయ బసవాఖ్య స్స్వానుభూతైక్య సౌఖ్యః
ప్రమథగణ పవిత్రః ప్రస్ఫురద్భక్తి గోత్రః
ప్రణమిత బుధవర్యస్సో యదైశ్వర్యధుర్యః
ప్రథిత వృషభ రూపః ప్రాజ్యమాన ప్రతాపః

ఈ వృత్తము తరువాత నక్షర మాలిక యిట్లున్నది.

"అపిచ శివ శృంగార ఓం – ఆది పద విస్తార ఓం
ఇహాపర సుఖాధార ఓం – ఊర్ధ్వరేతోజాత ఓం
ఋషభ నామఖ్యాత ఓం – బీజ మాయాతీత ఓం
... ... ... ...
కలిమలాపహ శౌర్య ఓం – ఖల నిరసనాచార్య ఓం
గళమర్దనవర్య ఓం – ఘన శివార్చనధుర్య ఓం
... ... ... ...
వరదలీలా సక్త ఓం – శమిత విషయోద్రిక్త ఓం
షడ్వర్గ నిర్ముక్త ఓం – సహజ జంగమ భక్త ఓం
క్షరముఖ చారిత్ర ఓం – అక్షర స్తుతిపాత్ర ఓం."

ఇందు ప్రతి పాదమున నైదు మాత్రలు గల రెండు గణములున్నవి. అంతమున ప్రణవము ఓం కూర్చబడినది. నాలుగు పాదముల కొకటి చొప్పున అంత్య ప్రాసము కూడ కలదు. చివరను "శివకర శ్రీ బసవ దండనాథ ఓం నమస్తే, నమస్తే నమః" అనియు.

"అకారాది క్షకారాంత మేకరేఫ దళ మాలికాం
వ్యతానీత్ సోమనారాధ్యో బసవస్య కృపానిధే"

అను శ్లోకమును నున్నది. పేరున కిది అక్షరాంక 'గద్య'మే యైనను, నిశ్ఛందముగా నున్న భాగమిందు కొలదికూడ లేదు. ఇది యాంధ్ర భాషను కాని, తద్రచనా ప్రక్రియమగు వచనమునుగాని దృష్టియందుంచుకొని రచించినట్లు కాన్పించదు. విభక్తి ప్రత్యయములు కూడ తెలుగు కావు. అందుచే నిది యాంధ్రభాషా సంబంధిత రచన కాదనుట స్పష్టము. సోమనాథకృత సంస్కృత రచన యనుట సమంజసము.

**4. అష్టోత్తర శతనామ గద్యము :** సోమనాథుడు రచించిన యీ గద్యమింత వరకు ప్రచురితము కాలేదు. బసవపురాణ పీఠికలో కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆద్యంతముల నిట్లుదాహరించిరి.

ఆది :

శ్రీ మద్గురు బసవేశ నమస్తే, సోమ యశ భవ నిర్నామ నమస్తే,

అంతము.

ఆద్య నమస్తే, వేద్య నమస్తే, తత్త్వ నమస్తే, చిత్వ నమస్తే
భావ నమస్తే, భావి నమస్తే, సద్గురు బసవస్వామి నమస్తే.

దీనిని గురించి 'పాలకురికి సోమనాథుఁడు' అను గ్రంథమున శ్రీ బండారు తమ్మయ్యగారిట్లు వ్రాసిరి. "వీనిని (ఆద్యంతములను)బట్టి యీ గద్య పాదములు కూడ ననుస్వార గద్య వలెను, పంచ ప్రకార గద్యము నందలి రెండు, మూడు, ఐదు విధముల గద్యముల వలెను, నాలుగేసి మాత్రలు గల గణములు నాల్గింటితోఁ గూర్పఁబడినట్లు కాన నగును. నామమును బట్టి చూడ దీనియందు గూడ 108 పాదములుండునని తెలియ నగును" బండారు తమ్మయ్యగారి యీ యభిప్రాయముతో నేకీభవించుటకు నే సందేహమును లేదు. దీనినిబట్టి అష్టోత్తర శతనామ గద్యము కూడ నిశ్ఛందమైన వచనము కాదనియు, ఒక గణనియమ ప్రకారము కూర్పబడినదనియు చెప్పవలసి యున్నది.

సంస్కృత భాషలో సర్వ సామాన్యముగా నున్న అనుష్టుబాది ప్రఖ్యాత ఛందములందు గాక నితరములైన రగడ భేదములందును, స్వచ్ఛంద ఛందముననను రచింపబడిన రచనములను గద్యములనుట సంప్రదాయముగా నున్నది. అనగా వీనిని సంస్కృత కవులు లాక్షణికులు ఛందో నియమముల యందంగీకరించ లేదన్నమాట. అట్లు వీనిని గణ యతి

ప్రాస నియమము లున్నను నిశ్ఛందముగానే భావించి వానికి గద్యనామ మిడిరి. పైన పేర్కొన్న పాల్కురికి సోమనాథుని గద్య రచనలు — ఛందోబద్ధములైనవి — పైగద్య విభాగముననే చేర్పవలసి యున్నవి. వీని కాంధ్ర వచనముతో సంబంధము లేదు.



కవిత.

# శిపవరణము

— శ్రీ కోట సుందరరామశర్మ

శ్రీకారంబును జుట్టినాడ శతకప్రీతిన్ నినుంగొల్వగా;
సాకల్యంబుగ నిర్వహింపవలె, నీశా, నీ దయాలేశమే
కాకే మున్నది దిక్కు నాకికను; నే గైతల్ వచింతుంగదే
నీకై, పుణ్యపురీనివాసిపరమా, పర్వతేశప్రభూ!

నిరలంకారమదీయ కావ్యతనయానిస్తేజముంగన్న నీ
వరలోకంబున నేరికేన్ గలుగునే పాణిగ్రహాకాంక్షయున్?
పరిచూపందని కోయకొంపదొర! వేసం బేమియుంగోర, వాం
టరి. యింకేటికి వేరెయయ్యగన, నన్నా. పర్వతేశప్రభూ!

అనిపల్లెల్లను బెట్టునేయుతగవయ్యా, కొండరాయల్లు నిం
దనముల్నాపయి జూపగానగునయా? నాపాటికే పిప్పిపి
ల్లను నీవను బెట్టుకొంటిని, నేలంజూపి. వేషాలలం
గొనిపెట్టంగ నరించుయుండు, మరిగైకో, పర్వతేశప్రభూ!

తల్లిదండ్రియు నీవె చూడితప గాదాయన్న నాకేరటం,
చిల్లావాకిలికాలుతేవలిన నాకేమున్న దేమంచునున్,
వెల్లెద్దెక్కెడివాడవటన్న, నదియుం బెర్రేగదా నాయటం.
దెల్లన్ గిటునటుచ్చి. కోపమదినన్నె. పర్వతేశప్రభూ!

శంకై తల్ మదిమెత్తువానరిమె, కానేనిన్ నరే, మెంనన్
నాకోన్నాటి మహాపగాంబువులోనంజేర. నేకొంపలం
దే కొంచెపువాగు లావెవలియున్ ఏ రీతినేంగాంచవే
ఆకల్పంబుగ లోకపావనత, నాహా, పర్వతేశప్రభూ!

నాయీ పద్యశరాఖ్యధాన్యమును, నన్నా, నీదుపాదాబ్జసీం
దేయుంతున్ గయికొందువే సరిమెరాదే యందామేలాను నా
కే, యెట్లన్న, భవత్పదాంబుజరజంబే పాతరంబెట్టుచో
నాయీ పంటకు హెచ్చుదివ్యగుణమెన్నం, బర్వతేశప్రభూ!

('పర్వతేశప్రభు' శతకము నుండి)

# పార్వతీ పరిణయ విమర్శనము

— శ్రీ 'గాండీవి'

పార్వతీ పరిణయము కోటి రాయరఘునాథ తొండరమాన్ విరచితము. దక్షిణాంధ్ర యుగమునందలి కవిరాజులలో నీ రాజకవి యొకఁడు. ఇతఁడు పుదుక్కోట నేలినకాలము 1767-89 మధ్యనని పీఠికాకర్తగారు వ్రాసినారు. ఈ కావ్యములోఁ గాళిదాసుని కుమారసంభవ శ్లోకముల కాంధ్రీకరణములు కన్పట్టుచుండుటచే దీనికిఁ గుమార సంభవమే మూలమని యూహింపనగును. కాని యిది మక్కికి మక్కి యనుసరణము కాదు. కవి కుమారసంభవ కథలో మార్పులు చేయుటయేకాక నూతన కల్పనలు గూఁడ బ్రవేశపెట్టినాఁడు. ముందు వాని యౌచిత్యానౌచిత్యములను బరిశీలించుట కర్తవ్యము.

1. మార్పులు :- (1) కుమార సంభవమునఁ బార్వతీదేవి మేనక కన్నకూఁతురుగాఁ జెప్పఁబడినది. ఇందుఁ బరమేశ్వరి మేనకా హిమవంతులకుఁ బ్రత్యక్షమై తాను వారికిఁ బుత్రికగా నుండుటకు వచ్చినట్లు తెలిపి శిశువుగా మాఱును. మాయామోహితులై వారామెను గన్న శిశువుగా భావింతురు. పరమేశ్వరి నయోనిజగా వర్ణించుట యుచిత తరమను తలంపుతో నీ మార్పు కవి చేసియుండును.

(2) పార్వతీదేవి తల్లిచేఁ దపస్సునుండి నివారింపఁబడి 'ఉమ' అను నామము నొందినట్లు కుమార సంభవములోఁ గలదు. 'ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా, పశ్చాదు మాఖ్యాం సుముఖీజగామ' అని ఇందు వేఱు విధముగాఁ జెప్పఁబడెను.

క॥ ప్రణవ స్వరూపవయై తగ
నణఁకువగఁదదక్షరంబులన్నియు నుండన్
గణుతించి యంబకలముని
గణముమయని యపుడు నామకరణము చేసెన్.

ప్రణవమనఁగా 'ఓమ్' 'అ-ఉ-మ్' వర్ణములు ప్రణవ మునఁ గలవు. " అకారంచాప్యుకారంచ మకారంచ ప్రజాపతిః, వేదత్రయాన్నిరదుహాద్భూ

ర్భువస్స్వరి తీతిచ ' (2-76) అను మనుస్మృతి శ్లోకమిందుకుఁ బ్రమాణము. 'ఉమ' అను పేరులో నీ మూఁడు వర్ణములు (ఉ-మ్-అ-ఉమ) నుండుటచేఁ బ్రణవాచకములతో నామెకు మునిగణము నామకరణము చేసినట్లు కవి కల్పించినాఁడు.

(3) శివుఁడు పార్వతిని స్వీకరించునట్లు చేయుటకై మన్మథుని నియోగింపుమని బ్రహ్మయే యింద్రునితోఁ జెప్పినట్లు కవి యిందు వ్రాసినాడు. ఇంద్రుఁడు తానుగా మన్మథుని నియోగించినట్లు కుమార సంభవమునఁ గలదు.

(4) మదనుఁడు నందిచేఁ గనఁబడకుండ శివునియొద్ద కేగినట్లు 'దృష్టి ప్రపాతం పరిహృత్య తస్య' అను కుమార సంభవ శ్లోకపాదమువల్లఁ దెల్లమగుచున్నది. ఇందు మన్మథుఁడు నంది యనుజ్ఞతో నందుఁ బ్రవేశించినట్లు మార్చఁబడినది. ఈ మార్పు చేయనిచో నంది నజాగరూకుఁడనవలసి వచ్చునని కవి తలంచి యుండును.

(5) శివుఁడు మాయావటు రూపమునఁ బార్వతి వద్ద కేగుట, వారి సంవాదము, శివుని యాకస్మిక సాక్షాత్కారము కుమార సంభవమున హృద్యాతిహృద్యముగా వర్ణితములైనవి. ఇందీశ్వరుఁడు జరద్విప్ర రూపమునఁ బార్వతియొద్ద కేగి శివదూషణము చేసి చెలికత్తెలచే దెబ్బలుతిని పాఱిపోయి పిమ్మట నిజరూపముతో నటకు వచ్చినట్లు మార్చఁబడెను. ఈ మార్పుతోఁ గుమార సంభవమునందలి యొక మనోహర ఘట్టము నితఁడు పాడుచేసినాఁడు.

(6) కుమారస్వామి జననమిందు వేఱు విధముగాఁ గల్పింపఁబడెను. ఈశ్వరుఁడు పార్వతి ముఖము నఖరతితో జూఁడగా ఫాలనేత్రమునుండి వెలువడిన ప్రభ కుమారునిగా మాఱును.

2. నూతన కల్పనలు :- (1) మన్మథుఁడు శివాశ్రమమున కేగునపుడు కళావతి యను గంధర్వకాంత యెదురుపడి శివుడు పార్వతి నొల్లకున్న విషయము తెల్పుట యొక నూతన కల్పన. 'సరస ప్రబంధముల్ చదువుచు నుండిన, మంచి కల్పన యంచు నెంచుకొనఁడు, వాత్స్యాయనం బోక వంకఁ జూచుచునుండ, నేటి పుస్తకమని యెత్తికనఁడు.' ఇది యామె ధోరణి. ఇది విరసమని చెప్పనక్కఱలేదు. ఈమె తన కూఁతు నొల్లనందుకు శివుని యరసికతను మేనక నిరసించుట కూడ వెల్లడించెను. పార్వతిని

శివుని పరిచర్యకు నియోగించుటలో మేనకాహిమవంతుల యభిప్రాయ మతఁడామెను మోహింపించి చేపట్టుటకే యని కవి తలంపు. కావుననే యతఁడిట్లు వ్రాసినాఁడు. ఇది సంప్రదాయ విరుద్ధము గుటచే ననుచిత మన నగును. కాని నారదుని వలన మేనకాహిమవంతులు శివుఁడు పార్వతిని వివాహ మగునని వినియున్న వారగుటచే నామె నతని పరిచర్యకు నియోగించుటలో నీ యూహ యుండునని కవి తలంచి, యుండును. అశ్వ్రప్తినా థంగ ధయమున హిమవంతుఁడు శివునకుఁ దన కూఁతు నిచ్చునట కున్నను నమః సహాయాంతరము చింతించినట్లు మల్లినాథ వ్యాఖ్య వల్లఁ దెలియుచున్నది. 'యమైవ శర్వో జననే శరీరం' (1–53.) అను కుమార సంభవ శ్లోకము నొద్ద "చింతయా సహాయాంతరం చింతి తానితి వక్తుం ప్రస్తౌతి" అని మల్లినాథుఁడు సూత్రముంచినాఁడు. ఆ సహాయాంతరము పార్వతిని శివ పరిచర్యకు నియోగించుటయే కాని వేరు కాదు. ఏమైన నిది కొంత విరసముగా నున్నది.

(2) శివుఁడు పార్వతి యొద్దకు వచ్చి కోరిక యేమో చెప్పుమనుట, శివుఁడు గాంధర్వమునఁ బార్వతిని వివాహమగుచు ననుట 'అమ్మనే పల్లె రెంతటి యూహకుఁడు, చింత దెలియన్న నొక్కింత సిగ్గుపడఁడు,' అని పల్కు యీ మను జేకొని జోపుఁడ సరస ప్రసంగములు కావు.

(3) బువ్వపు బంతిలో శివుని సిగ్గు లేనిదని యమృతకర గంగతోఁ బరియాచికము లాడుట పేలవకల్పన. ఇది యనసు హాస్యప్రీతికి నిదర్శన మననగును. 'పెరుగు మున్నది వారుసఁ బెరుగుటంచుఁ, బేరువచ్చెనో దధికి మీ పెండ్లిలోన' 'సలిల మూర్తులగుటు మీర శుద్ధవారుల్, భావసంపత్తి నొకటియై పరుగునను చు, నీళ్ళఁ బాలని వడ్డించు నిన్ను వంటి. ఏక విదుషి గల్గునె వినంగ నోసి గంగ' మొదలైనవి దీనికి నుదాహరణముగా గంగాదేవి 'అడవి యాకుల తినువారి కనువులగునె, మేము చేసినవంటు' అనును. ఈ రహస్య ప్రీతితోఁ గొన్నిచోట్లఁ బాత్రల యుదాత్త చిత్రము ధ్వంసమగుచుండును. 'ఓరయ్య గణపతి పెళ్ళి యయ్యేదఁ గాని యచ్చట్లు యీ దుప్పటదుగ వలదు' అని శివుఁడు గణపతిని బ్రతిమాలుకొన్నాఁడు. ఇవి నటనకన్నను నుదాత్తత లోపించుట స్పష్టమే.

(4) శివుని పెళ్ళికి వెడలునపుడు రంభోర్వశులు కలహించుకొనుట

కొనుచుండెడి వారేమో! 'గ్రామంబు తెన్నని కలసి నే నడుగంగ, నూళ్ళ పేళ్ళన్న వే వేళ్ళయందు' ఇత్యాదిగా వారి యధిక్షేపణము లున్నవి- ఈ కల్పన కొంత వైరస్యహేతువయినది. ఇది దక్షిణాంధ్ర ప్రబంధములకు సామాన్య లక్షణమే.

(5) కుమారస్వామి వేట, వల్లీ పరిణయము వర్ణితము లయ్యెను. పార్వతీ పరిణయమునకీ వల్లీ పరిణయ మావశ్యకము కాదు.

(6) మన్మథుఁడు పునర్జీవితుఁడగునని యాకాశవాణి చెప్పినపుడు వసంతుఁడు సాముద్రిక శాస్త్రము నేకరువెట్టును. ఆ సందర్భమున నిది యనుచితము.

శివుఁడు పార్వతీసౌందర్యమును విస్తృతితో వర్ణించి చెప్పుటలోను, నందితో విరహవేదనను శివుఁడు చెప్పుటలోను నసౌచిత్యము లేర్పడినవి. దేవతలు తారకుఁడు పెట్టు బాధలు చెప్పుకొనఁగా బ్రహ్మ వికవికనవ్వి పరిహసించుటకూడ నుచితముగ లేదు.

3 వర్ణనలు :- వర్ణనలు కథాగతితో సంబంధింపఁబడి యుండుట యొక ప్రశంసనీయమైన పద్ధతి. పార్వతి కాపురావని యేడ్చుటయిట్లు వర్ణితమయ్యెను.

ఉ॥ దక్షుఁడటన్న నాయకు యథార్థముగా నొక ప్రాపయుండఁద
ల్లక్షణ మించుకేనియుఁ దలంపక తత్సుతకై తివాఁడునున్
శిక్షకుఁడయ్యె సిగ్గులచేసిన నా మొఱ్ఱ్రోత్త కావు ఫా
లాక్షయుటంచు నేఁడుకొనుసట్లనె యాపెకాపు గావనెన్.

పార్వతీదేవి బాల్యావస్థాసూచకముగా 'చెంపబోటికి స్వర్ణచేలంబుల నొసంగి, పాపటూఁపులఁ దీసి మూరవైచు' ఇత్యాది పద్యమున బాల్యము వర్ణింపఁబడెను. పార్వతి తపస్సు చేయునప్పటి వర్షాగమము కవి యిట్లు వర్ణించినాఁడు.

ఉ॥ గౌరితపంబు చేయఁగను గన్గొనికుందెడు తోడిబోఁట్లు ని
ట్టూరుపు మానసాంతర సముత్థిత శోకఘనానుపావకాం
కూరముచుట్టి బ్రోఁబ్బుకొని గొబ్బున వెల్వడెనో యటంచనన్
నీరదముల్ కనంబడియెనింగిఁ దటిచ్ఛట లుల్లసిల్లఁగన్.

వర్షపాతమును 'బలభిత్కోదండ దండాగ్రగని, స్ఫురదుద్వేల శరావళీ' త్యాదిగా నారంభించి ద్రాఘిష్ఠసమాసములోఁ జెప్పినాఁడు. ఈ సమాసము వర్షపుసాంద్రత్వమును ద్యోతకముచేయును.

4 **సంవాదములు :-** ఇంద్రమదన సంవాదము, పార్వతీజరద్విప్ర సంవాదము, సంవాదములలోఁ జేర్కొనఁదగినవి. మన్మథుఁడు రాఁగానే యింద్రుఁ డతని శీఘ్రగతిని శ్లాఘించును. మన్మథుఁడు మధ్యమార్గములో రంతొక్కటి కలుగుటచే నింక నాలస్యము జరిగెనని యిట్లుచెప్పినాఁడు.

గీ॥ అదె వినెదె యొక్క శ్రోత్రియుం డతివపైని
నలిగి జందెలు ద్రెంచె సన్న్యాసమనుచుఁ
ద్రెంచివైచిన వానినే తిరుగదాని
పూసలకొసంగఁ జేయింపఁ బ్రొద్దుపోయె.

మన్మథుఁడు 'తరలఁజేతు గిరీశుల ధైర్యము' అనిన పిమ్మట 'విషమాంబకత్వంబుఁ జూచుపట్ల నీకుజోడతండు' ఇత్యాదిగా నింద్రుఁడు పల్కి యతనిఁ గార్యోన్ముఖునిగాఁ జేయును. వసంతునిచే సొమ్ములు వలువలు పంపించును.

వృద్ధ విప్రుఁడు శివున కొక కాలు కుంటివలెనున్నదనియు "కోడె నే, వేళలనెక్కుచుం దిరుగ వెట్టిదియె? యల్లది క్రింద మోపకే, కేళికయాడఁగాఁ దెలిసె" అనియుఁ జెప్పును. కాళిదాసు 'వపుర్విరూపాక్షమ్' అని యనఁగా 'తొండరమాన్' కవి శివుని మూఁడుకన్నులకు లోపము చెప్పినాడు.

క॥ ఒక కనుతెలియదు రాత్రుల
నొక కను పగలింటఁ దెలివి నొందక యుండున్
ఒక కన్ను పొగరు కమ్మిన
దిక నెవ్వతె శివునిఁ జెంద నిచ్చించుమరిన్.

జరద్విప్రుని దూషణములు విని పార్వతీదేవి తన యన్న లేకపోవుటచే నీశ్వరుని దూషించి బయటఁబడినాఁడని పల్కిఁ ముల్లంగిచెట్టు సమూలంబుగాఁ బీకు, బొక్క పోలికనుండె బొక్కినోరు, ఇత్యాదిగా నావృద్ధ భూసురుని విరూపత్వమును నిరసించును. 'తనుభజించిన బాలుఁ జెనఁకినయము నడ్డి, వెలుగఁదన్నినది గుర్తెఱుఁగలేదో' అని యీశ్వరుని మహాత్త్వమును

వర్ణించును. తన వివాహమును జూచి యానందించు భాగ్యము తన తల్లికి లేకపోయినదని పలు విధముల వాపోవును. ఆమె చెలికత్తెలచే దెబ్బలు తిని జరద్విప్రుడు పాఱిపోవును.

కుమార సంభవము నందలి పార్వతీమాయావటు సంవాదము నందలి యుదాత్తతను సైతము మీ గ్రంథకర్త విధ్వంసము చేసినాడు. అందు మాయావటుని శివ నిందను సోపపత్తికముగా పార్వతీదేవి ప్రత్యాఖ్యానము చేయును. ఇంకను మాయావటు వేదో చెప్పబోవు చుండగా నటనుండి లేచి పోబోవును. అంత శివుని హఠాద్దర్శన లాభము కలుగును. శ్రీనాథుని హర విలాసములో పార్వతి సమాధానములు ఉత్తమములయ్యెను, అవి శ్రీనాథుఁ డాంగ్రీకరింపక పోవుటకు గారణములు నా హర విలాస విమర్శనమునఁ జెప్పియున్నాను.

5. రతి విలాపము :– కుమార సంభవమున రతి విలాపము, కరుణ రసపూరిత ఘట్టము. అందుఁబునఃపునర్దీప్తి దోషము కలదను నాలంకారిక వచనముండుఁ గాక! ఇందు రతి 'రసికులు వినుచు మెచ్చవశులు వెట్టి యేడ్చె'నని కవి యుపక్రమించినాడు. భర్తృ వియోగముతో నామె యేడ్చుచుండఁగా సానుభూతి లేకపోవుట యీ వాక్యము వల్లఁ దెలియు చున్నది. ఆమె మామయగు విష్ణుమూర్తిని, భర్తను దహించి వేసిన యీశ్వరుని, దూషించినట్లు కవి రచించినాడు. మామ మగవాఁడు కాఁడట. ముదుసలి మగువయట.

గీ॥ శరభమై వచ్చి మును దన చట్టుఁ జీల్చెఁ
బెద్ద కొడుకును దలఁద్రుంచెఁ జిన్నవాని
నిటులఁ గాలించె శంభుఁ డిదేమియనని
మామ మగవాఁడె ముదుసలి మగువ గాక.

ఇట్లు మామను నిరసించి 'కూఁతురు మోము చూచి, యతని నేమనఁ జాలఁడా హరి నిజంబె' అని సమర్థించినది. ఈ కూఁతురు గంగాదేవి కాఁబట్టి తనకు సవతిని గూర్చ వెంచు మన్మథుని గంగాదేవియే యిట్లు శివునిచేఁ జంపించినదని యామెనుగూడ దూషించినది.

గీ॥ శరధియొద్దను గొన్నాళ్ళు సౌఖ్యమంది

హారుని తలకెక్కి కూఁతాడు నట్లుచేయు
కూఁతురా నేను హారికినిఁ గోడలంట.

రతీదేవి, హారుని వింతకథల నిట్లీసడించి పల్కినది.

క॥ తనకామేనునఁ బాండువు
తనయునికి మహోదరంబు దానికిఁ గొండెల్
వినిసేయు హాత్యామందా
కనుఁగొనుమా హారుని వింత కథలు వసంతా.

6. కుమారసంభవాంధ్రీకరణము :- పార్వతీ పరిణయమునఁ గుమార సంభవ శ్లోకముల యాంధ్రీకరణములగు పద్యములు కొన్నిగాఁ గలవు. అందును స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణ పద్ధతులే యవలంబింపఁబడినది.

శ్లో॥ రజనీం తిమిరావగుంఠితే, పురమార్గే ఘనశబ్దవిక్లబాః
వసతిం ప్రియకామినాం ప్రియాస్త్వదృతే ప్రాపయితుంక ఈశ్వరః

ఈ శ్లోకమును 'పెళపెళమని ప్రేగు పిడుగుల మొత్తము, పెద్ద క్రోవుల వాగుచిమ్ముగాఁగ' యను సీసపద్యముగా విస్తరించినాఁడు. కవికిఁ గుమార సంభవ శ్లోకములఁ దెనిఁగించి తన గ్రంథము నలంకరింపవలెనను తలంపులేదు. ఆంధ్రీకరించి యట్లు చెప్పియుండవేని యెంతయో బాగుండెడిదని తోఁచును. ఉదాహరణమునకు రతివిలాపమునుండి రెండు మూఁడాంధ్రీకృత పద్యముల నాఘనిపములఁ జూపెదను.

గీ॥ ఈపగిది ననిలాహతదీపమట్లు
నీ సఖుండు గతించె రానేరఁడిఁక
మాధవ! యసహ్యశోకధూమావృతనయి
దశవలెనె యున్న నాదు దుర్దశను గనుము

సీ॥ ఇంచు పిల్లువఖించి వర్జించితన్ను
ముండ విధియర్థ నిరసనమును బొనర్చె
అకట! యనపాయమగు సంశ్రయంబు ద్రుమంబు
వారణము గూల్పఁగూలదే వల్లరియును.

7. వ్యాకరణ వ్యామోహము :- వ్యాకరణ వ్యామోహముగల కవు

సుని కాళిందీపరిణయ పరిణయమున గోచరించును. రతివిలాపములోని యీ క్రింది పద్యమును జూడుఁడు.

క॥ స్త్రీలోపము పుంశేషం
బిలలన్ ద్వంద్వమున మునీంద్రుఁడు చెప్పెన్
శూలికడ నేర్చి తన్మత
మీలాగని తెలియఁడయ్యె నీక నేమందున్

ఏకశేషవృత్తిలో స్త్రీవాచకముతోడ సహోక్తియందుఁ బుంవాచకము శేషించునని పాణినిముని చెప్పెను. "పుమాన్ స్త్రియా. (1—2.67.) స్త్రియా సహోక్తౌ పుమాన్ శిష్యతే తల్లక్షణ ఏవ విశేషశ్చేత్ హంసీ చ హంసశ్చ హంసౌ (సి. కౌ 933.)" "పితా మాత్రా (1.2. 70.) మాత్రా సహోక్తౌ పితా వా శిష్యతే - మాతా చ పితా చ పితరౌ - మాతాపితరౌ (సి. కౌ 936)" ఇచ్చట రతి మన్మథులలో రతిదేవి శేషించి మన్మథుఁడు లోపించెను. పాణినిమునికి మహేశ్వరుఁడు 'అఇఉణ్' ఇత్యాది పదునాల్గు సూత్రములు ప్రసాదించి యున్నాఁడు. ఈశ్వరుఁడు రతిదేవిని మిగిల్చి మన్మథుని భస్మముచేసినాఁడు. అనఁగా స్త్రీవాచకముతోడి సహోక్తిలోఁ బుంవాచకము లోపించి స్త్రీవాచకము శేషించుటయే శూలిమతమనుచున్నది. పాణినిముని దానిని గ్రహింపక పుంవాచకమే శేషించునని నెననియుఁ జమత్కరింపఁబడినది. ఇట్టి చమత్కారమునల ప్రాస్తావిక శ్లోకములు కలవు. "నపుంసకమితి జ్ఞాత్వా, ప్రియాయై ప్రేషితో మనః, తత్తు తత్రైవ రమతే, హతాః పాణినా వయమ్" "యాచం మణిం కాంచనమేకసూత్రే, గ్రథ్నాతి శిల్పీ నహి తత్ర చిత్రం, అశేషవిత్పాణిని రేకసూత్రే, శ్వానం యువానం మఘవానమాచే" మున్నగునవి.

పార్వతీదేవి 'నీలకంధర' అనెనఁట, చెలికత్తె లదేమని యడుగఁగా నెమలి పిల్పని చెప్పెనఁట. అంతఁ జెలికత్తెలు "అమ్మమ్మ యెంతసాహస, మమ్మాటకు ముత్తిరాదెయ మహాత్తాటన్" అన్నారఁట. సమాధానము తోఁపక పార్వతియూరకొనెనఁట. 'భవేవమహాతోప్యర్థ విశేషేమహాదాకృతిః' అను నాథర్వణము చొప్పున 'నీలకంధర' యను సంబోధనము నెమలి విషయమున సరిపెట్టవచ్చును గాని యర్థవిశేషము వివక్షింపవలసిన పని యంతగా లేకుండుటచే మహాద్విపక్షచేయ నక్కఱలేదని కవి తలంచి యుండవచ్చును

శివుఁడు పార్వతీపాణిగ్రహణము చేయుట యిట్లు చెప్పఁబడినది.

గీ॥ అంతహరుఁడు స్వపాణినీయతను దెల్పె
నచలకన్యా కరంబున కదిస్వకంక
ణారవమిషంబునను శబ్దవారమెఱిఁగి
సంతతము తత్త్వదర్శ ప్రసంగితఁగనె.

ఈ వ్యాకరణ వ్యామోహములోఁబడి యుచితానుచితములను గూడ గ్రంథకర్త పరికింపకుండుట శోచనీయము. దేవతలు శివునియొద్దకు వచ్చి 'అంగజారే నమోనమః యనుచు' మ్రొక్కఁగా నీశ్వరుఁడు వారు 'అంగజారిః' అను దానినిఁ దత్పురుష విగ్రహ మనుకొనుచున్నారనియు బహువ్రీహియని తెలియలేరనియు ననుకొనును. 'అంగజస్య అరిః అంగజారిః' అనికాక 'అంగజః అరిః యస్యసః' అని విగ్రహము నెన్నవలెనని కవితలంపు కానోపును. వ్యాకరణ విషయకములగు నిట్టి వాదములతఁడు పండిత కవులతోఁ జేయుచుండెడి వాఁడని యూహింపనగును. కవి మన్మథుని 'ఈశవైరి' అని సంబోధింపఁజేసెను. 'మదనారి' అని శివుననుట తగును గాని 'ఈశ్వరారి' అని మన్మథునను వ్యవహారము లేదు. ఏల యనరాదను ధోరణిలో దీని నితఁడు ప్రయోగించినట్లు తోఁచెడి. ఇట్టి పద్యము లింకను గలవు.

'చుకుసుమిదర్శిషత్, సనినేత్రిషత్, జిగనేమిషత్, శిశిసనిషత్, అతిశ్మ్రభూషత్, పంక్తిపిసవనిషత్, ద్వైవతితపరిషత్, ఘుజిగరాడిషత్' అను ప్రౌఢ రూపముల నితఁడు ప్రయోగించినాఁడు.

8. ఇతర విషయములు :- ఈశ్వరుఁడు పార్వతిని వివాహమాడు నని విని హిమవంతుని చుట్టములగు గట్టుకొరలు 'ఇంద్రుఁడు తమ యొద్దికే తేరలేవక, కనుసన్నఁ గూర్చుండు మనెడివారు' ఇత్యాదిగానుండిరఁట. ఒక యధికుని ప్రాపు లభించినపు డల్పులెట్లు విఱ్ఱవీగుదురో యీ పద్యమున వర్ణింపఁబడెనన్నమాట. ఇది కవిలోకజ్ఞతకు నిదర్శనము. దేవతలు బ్రహ్మయొద్ద కేగినపుడు బృహస్పతి బ్రహ్మతోఁ జేసిన ప్రసంగము కవిపోషకుఁడు కాని రాజునుగూర్చి కవిపోషకుఁడగు రాజుతోఁ దత్కవు లొనర్చు మొఱ్ఱను బోలియున్నది. 'కచభారమును గుబ్బకవమేని తావియు, ఘనసారవిస్ఫూర్తి

ములో మూఁడు నాలుగుకు మించి లేవు. "ఘన, సార, ఘనసార" అని ఘనసార శబ్దమును మూఁడు రీతుల భేదము చేసికొని యర్థము నెన్నవలెను.

వ్యావహారిక ప్రయోగములు చేయుట, పాత్రోచిత భాషను దృశ్య కావ్యములలోనే కాక శ్రవ్య కావ్యము లందును ప్రయోగించుట దక్షిణాంధ్ర కవుల ప్రత్యేక లక్షణము. ఈ గ్రంథములో వ్యావహారిక ప్రయోగములు సమ్మతింపఁబడి యున్నవి. 'పఠించేవేళ, కదిమేటందుకు, అయినా, పోయేరు, నీవు చేయమని, ప్రొమ్కేము, ఇంకా, పత్కేది, ఉంతాము, మొదలగునవి. చెల్లెలు బహువచనమును దృష్టితోఁ చెల్లి' అను నేకవచన రూపము కవి ప్రయోగించినాఁడు.

"అంచ జెక్కలు దూసినించు సూరెపుటంపుఁ దలగడ మెత్తనఁదట్టి వైచి" అనుచో 'సూరెపుట' శబ్దము ప్రయుక్తము. సూరపుటము, సూరెపుటము, సూర్పాటమునను మూఁడును సాధువులే. ఇవి బ్రౌణ్య మునఁ జూపఁబడెను. 'సూర్యపుటము' అనునది కూడ సాధువే యనుటకు విప్రతిపత్తి లేదు. 'సూర్యపుటము' అనరాదను శబ్దరత్నాకరాశయము ప్రామాదికము. కాని 'సూర్యపుటంపు గద్దియనందమైన' (2-282) అను "దశావతార చరిత్ర పద్యములో 'ర్య' యతిస్థానమున నున్నది. దానినెట్లు మార్చగలరు" అని శబ్దరత్నాకరముపైఁ జేయఁబడిన యాక్షేపణము మాత్రము సరికాదు. 'సూర్యపటంపు గద్దియ నందమైన' అన్నను క్షతి లేదుగదా !

'పాణిగృహీతి' శబ్దమును గ్రంథకర్త వాడినాఁడు (4-73) "పాణిగృహీతీ భార్యాయామ్. పాణిగృహీతాన్యా" అని సిద్ధాంత కౌముది. 'కల్హారా' శబ్దము 'అడరు కువలయ కల్హార హల్లకాది' (4-13.) అనుచో ముద్రిత మయ్యెను. సంస్కృత పదముల విషయమున నీ గ్రంథకర్త భ్రమపడు వాఁడు కాఁడనుట కీ గ్రంథమే నిదర్శనము. కావున 'కహ్లార' అనునదే కవి ప్రయుక్తమై యుండును. కొందఱు సామాన్య కవులు 'కల్హార, కలుహార' శబ్దములను సంస్కృత సమాసములలో వాడిరి. అవి ప్రమాణీకరింపఁ దగినవి కావు.



# ప్రియ సందేశము

— శ్రీ వి. వి. సింగరాచార్య

అహో మనోహర ఇదియే
జానిదె నీప్రేమమహో!
మిల మిల మిల దళదళమున
మెరయు నుదయ కనక కాంతి
　　అహో మనోహర ఇదియే
　　జానిదె నీప్రేమమహో!

అలసాలన లీల నట
స్థలి దారెను వారిదమ్ము
ఎనుపు సమృత సేచనమున
దనుపు సుగంధానిలమ్ము
　　అహో మనోహర ఇదియే
　　జానిదె నీప్రేమమహో?

ఈ విఘాతశోభలు ముం
దెత్తెనహో నా కన్గవ
నంపితివే ప్రియా ప్రణయ
ప్రాణప్రియ సందేశము
　　అహో మనోహర ఇదియే
　　జానిదె నీప్రేమమహో!

నను గన నీవింత వ్రాలి
నంత గలసె మన చూపులు
నా మానస కుసుమ మంత
స్వామి! వ్రాలె నీ పదముల
　　అహో మనోహర ఇదియే
　　జానిదె నీప్రేమమహో!



వ్యాసము:

# ఆముక్త మాల్యద

— శ్రీ పప్పూరి రామాచార్యులు

(గత సంచిక తరువాయి)

## రాజనీతి

శ్రీరామ మిత్రులు చేసిన హితబోధ, చూపిన రంగనాథ నిక్షేపము, శ్రీ యామునుల వారికి భక్తి వైరాగ్యములు కల్గించినవి. ఆయన తన అపరాధము నెఱిగి వెంటనే తన తనయునికి రాజ్యము నొప్పగించెను. రాజనీతి నీ విధముగా కుమారునికి ఉపదేశించెను.

"నాయనా ప్రజా రక్షణము రాజునకు ముఖ్య ధర్మము. విపన్నులైన ప్రజలు మొఱపెట్టినప్పుడు విసుగుకొనక వెంటనే వారి కూయి విని వారి బాధ తొలగించ దగును. ఈ నీ కర్తవ్యము నెప్పుడును కాపురుషుల మీద నిడకుము.

ప్రజా క్షేమమును గోరు ప్రభువు యొక్క అభ్యుదయమును ప్రజలు నిరంతరము కాంక్షింతురు. దానివలన ప్రయోజన మేమి యని అనుకొనకుము. బ్రాహ్మణోత్తములు మొదలుగా సకల జనులు ఏక ముఖమున కోరుదానిని వారి అంతర్యామియైన నారాయణుడు తప్పక ప్రసాదించును.

అట్లని ప్రజల నాజ్ఞలో నుంచుటకు ఏమర వలదు. ఆభీరులు, భిల్లులు మొదలుగా నాటవిక జాతులలో నైతము అంపకోల దారపు పోగు సంజ్ఞతో నాయకుని అధికారము యథాతథముగా చెల్లుబడి అగుచున్నది. ఐనప్పుడు సార్వభౌముని ఆజ్ఞకు ఎల్లవారును భీతిల్ల వలదా? తన్నును రాజ్యమును పర రాజుల ఆక్రమణమునుండి రక్షించుకోజాలని రాజు ఎంతో కాలము తన ఆధిపత్యమును నిలువబెట్టుకో జాలడు. కావున స్థల జల గిరి వన దుర్గములు అభేద్యములుగా నుంచదగును. రాజ్య కాంక్షగల ద్రోహులకు దుర్గాధిపత్యమును ఒప్పగించకుము. ఆప్తులైన బ్రాహ్మణులనే వానికధిపతులుగా నియమించుట క్షేమము. అట్టి ఉద్యోగులు ఆప్తులైనంత చాలదు. వారికి భయము కలుగకుండ దుర్గ రక్షణ కావశ్యకమగు బలము

అందుకు ఆవశ్యకమగు ఆయమునిచ్చు భూమిని వారి స్వాధీనమున నుంచవలెను.

ఎంత ఆప్తునికైనను తొలుదొల్తనే ఉద్యోగాభివృద్ధి చేకూర్పరాదు. పెంచినవానిని కుదియించినప్పుడు వాడు తనదు తొంటిహీనదశ తలంపక ప్రభువుమీద నలుగును. కావున వాని శీల మెఱిగి క్రమవృద్ధిచే పెంచి ఎల్లవేళల నేమరక పనిగొనవలెను.

ఐనను అనభిజాతుని, కుగ్రామవాసిని, విద్యావిహీనుని, పిరికివానిని, బొంకరిని, ద్రోహమునకు వెఱవనివానిని, అపవాద భయములేనివానిని అన్యదేశ్యుని, అధర్ముని అట్టివాడు విప్రుడైనను ఏరే ఉద్యోగమున నుండనియ్యరాదు. పథిచ్యుతుడై దుష్టసంసర్గముగలవానిని చెంతజేర్చినచో కీడు తప్పకవాటిల్లును. పూర్వమున భ్రష్టుడగు విప్రుం డొక్కడు తనకు మహోపకారము జేసిన కొక్కెఱ నొక్కపూట కూటికొఱకు చంపిన నాళీజంఘుని కథ భారతమున వినమా ?

శాస్త్రజ్ఞానముకలిగి, రాజనీతినెఱిగి, అధర్మభీరులై, వయసు డెబ్బదిటికిలోను ఏబదికి మించినవారై, నిరోగులై, హితపూర్వులై, గర్వదూరులై, రాజు ప్రార్థనమీద అమాత్యతనైకొన్న విప్రులు మంత్రులైనచో రాజ్యాంగములు వృద్ధిబొందుటకు ఒకపూట జాలును. అట్టి మంత్రులు దొరకని యెడల తానే పరిపాలనాబాధ్యత వహించుట ఉత్తమము. అందువల్ల మేలుకానీ, కాకపోనీ యోజింపపనిలేదు. కాని గుణహీనుని ఒక్కని మంత్రిత్వాధికారమున నియోగించి వానికి ఆర్థికబలమును, సేనాబలమును యిప్పించితిమేని వాడు గుమ్మడికాయయంత ముత్యమై రాజునకు మనోవ్యథ కల్గించును. ఆతని చేతిలో బ్రదుకవలసినదుస్థితి ప్రభువునకు ఏర్పడుట తప్పదు.

తలకుమించిన బాధ్యతలను ప్రభువు ఎవ్వనికిని ఒప్పగింప జనదు. అట్టి పనులకు పలువురు నియోగింపబడిన యెడల వారి వారి ఇష్టులుకలిసి నిలిచి చేయగా పనులు సులభముగా నెరవేరును. ఒక్కడేయైనచో పనులగుట కష్టము. శ్రద్ధాభక్తులుగల దొరలు పలువురు పనిసేయక కేవలము ధనముచేతనే ఏపనియు నెరవేరదు. అట్టివారు ప్రభువునకు స్వాధీనులగుటకు, అతడు క్రోధలోభములు కొంత సత్ప్రవర్తనకలిగి, మిత్రసంపత్తిగలిగి యుండవలెను.

భాండాగారము చతురంగబలసమృద్ధియు కలిగియును రాజునకు అనువగు ఉద్యోగులు లభింపనిచో అవి నశించుటేగాక తర్వాత రాజ్యముగూడ

నశించి ప్రబలశత్రువులకు ఒదిగియుండవలసిన దుస్థితి రాజునకు తప్పనిదగును.

బ్రాహ్మణుడుద్యోగియైన యెడల ఇతర కులములవారికి ఆదర్శప్రాయుడుగా నుండగోరును తన పూర్వులవలె తానును ప్రభువును భక్తితో సేవింప కాంక్షించును. ధర్మమెఱిగి దాని ననుసరింపవలెనని పట్టుదలతో ప్రవర్తించును.

విపత్సమయములలో స్వామికి అండగానిలిచి కష్టముల నోర్చును. కావున బ్రాహ్మణునే అధికారిగా చేయుట రాజునకు హితము.

రాష్ట్రమునకు ఆయముగూర్చు మంత్రికి దేవబ్రాహ్మణ జీవనాధికారముల నొప్పింపకుము. ఏలన రాష్ట్రాదాయములో లోటు ఏర్పడినప్పుడు దేవాయతముల ఆదాయమును వాడుకొనును. అది రాజున కపథ్యమగును. కావునవానికై ప్రత్యేకాధికారియే యుండవలెను. వాడు దేవబ్రాహ్మణాదాయములో నించుక తిన్నను వాడే రూపఱి నశించును కాని రాజునకాపాపముంటదు.

కర్షకుడు మొదట క్షేత్రమును సంపాదించును. తర్వాత ఇతరులు దానిలో నాక్రమణ చేయకుండ చుట్టును కంచెవేయును. పిమ్మట వేరు వెల్లనికి త్రవ్వి కంటకశోధచేసి భూమిని మెత్తపరచును. ఆ విధముగనే రాజు తాను సంపాదించిన రాజ్యముచుట్టునుగల శత్రురాజులతో స్నేహముచేసి ఎల్లలయందలి దుర్గములను భద్రముచేసికొని పరుని ఉపద్రవ చింతలేనివాడై తర్వాత తన రాజ్యములోని క్షుద్రశత్రువులను ద్రోహచింతగలవారిని వెదకి నశింపు జేయవలెను.

కొండెగాండ్రను మహీశుడు మొదటనే నిరసించి దూరము చేసికోరాదు. అట్టి వారెన్నియో రహస్యములను తెలియపరతురు. వారు చెప్పునవి పదింబదిగా విని అవి అబద్ధములని తేలినను వారిని కించ పరచరాదు, మెల్లగా నట్టివారిని తొలగించుకోవలెను.

అసాధ్య నగాటవులలో చేరుకొని, భూపీడచేయు ఎఱుకుల పొరుగూళ్లను విదేశముల నుండి స్థితి తప్పివచ్చిన శూరులకు మనోవృత్తిగా నియ్యాదగును. వారు వీరినిగానీ వీరు వారినిగానీ పోరిగొని నశింపుచేసినచో ఎట్లయినను రాజునకు మేలేయగును. ఆ పార్వతీయ బలము అడవులలో ప్రబలినదా ప్రజలకుపద్రవము తప్పదు. కావున అయాటవికులను బెదరువాపి అనుకూలురుగా

చేసికోవలెను. వారు అల్పులైనందున వారికి విశ్వాసము అవిశ్వాసము, ప్రీతియు అలుకయు, అతివైరంబును అత్యానుకూల్యంబును అల్పస్వల్ప కారణముల చేతనే కలుగును.

అదెట్లనిన, ఒక భిల్లుడు పొరుగూరనున్న ఇంకొక భిల్లునింటికి పోగా వాడు వీనికి దుగ్ధాన్నముతో విందు చేసెను. వాని యింటి ప్రొయ్యిమీద నార ఉడుకుచుండగా వీరు చూచి అది ఉడుకుచుండు మాంస మనుకొని అది తనకు పెట్టలేదని కుపితుడయ్యెను. వాడు తన్ను అనుప దవ్వుగ రాగా వీడు చంప దలపెట్టెను. వాడు 'అన్నా నార ఉడుకుచున్నది, చెడిపోవునేమో త్వరగా వెళ్లనిమ్మని సెలవువేడగా అప్పుడు సమాధాన పడి వానిని హింసింపక పంపెను. కావున అల్పులతోడి స్నేహము వైరము అత్యల్ప కారణములవలన నేర్పడును. పాలుకూడు గుడిచి వారు మాట జెప్పిరా ప మాత్రమును తప్పరు కాని కొంత తప్పిన మేర్పడజూచిరా అదేపాటిదని ఊరకొనక పగబట్టెదరు.

సత్యమాడుట చేతనే ఆటవికులు వశ్యులగుదురు. దూతను సన్మానించుట చేతనే శత్రురాజులు మిత్రులగుదురు. నియమకాలమున తప్పక జీతముల నిచ్చుటచేత పదాతులును, పారితోషికము లిచ్చుటవలన అశ్వికులును, తనియెడ ప్రీతులగుదురు.

మంచి ఏనుగులను గుఱ్ఱములను ఆప్తభటులకే ఇమ్ము. వానిని దొరల పాలు పరపకుము. శాలలలో మంచిమేపున అశ్వములను గజములను పోషింపజేయుము.

సభలో ఒక్కడు కార్యము నిరూపించగా ఇంకొక్కడు మత్సరబుద్ధితో అదికాదని ఖండించును. ప్రభువు ఇరువురిని కాదనక కొల్వుముగించిన తర్వాత ఆలోచించి మొదటవాడు చెప్పిన రీతిని చేయగా శుభమగును.

దుస్సచివులు బలముగా నల్లుకొని నిర్భీతులై రాజునకు తామే దిక్కుగా ఇతరు లెవ్వరు ఆధారము కాకుండ జేసి వెలి పగ ప్రజ్వలించినప్పుడు లోని దస్యులకు ప్రోత్సాహము నిచ్చి తాము ఏ పనిని తెగబడిచేయక రాజును చిక్కుబడచేతురు. అట్టి దుర్మంత్రులకు అధికారము దక్కనియ్యరాదు. అట్టివారు తమకు వశులైన వారికే రాజు చేత అన్నియు నిప్పింతురు. వశులు కాని వారిని తప్పింతురు. నమ్మకము చెడి ఇతరులు రాజును చేరరాకుండు

కఫ పిత్త వాతములచే మందగించిన జఠరాగ్నిని వెలి ఔషధములు ఉద్దీపింప జేయునట్లు ఆ దుర్మంత్రులకు ప్రతిగా ఒక సమర్థుని ప్రభువు నియోగించినచో వాడు వారి మదమును అణచును. హయగజసంపదయు భండారమును తన వశమైయుండెనేని నీతి విశారదుడును శూరుడునగుపతి ఎదుట దుర్మంత్రి వ్యాపారము ఒక్క నిమిషములో అదృశ్యమైపోవును.

ఒక కడి అన్నము తగ్గినను భటులు ఓర్వక పతిని చెడజాతురు. కావున రాజునకు స్నేహితు లొక్కడుండుటయు అరుదే. అయినను రాజు మూర్ఖపు పట్టుదలతో వారి భృతిని పెంచక పోద్రోలరాదు. వారిని నమ్మకున్నను నమ్మినట్లే దయచూపుచు నేర్పున మెలగవలయును.

లోభము చేత ఎవ్వడైనను ఒక్క అక్రమకార్యమును దోయక చేసెనేని వాడు ముందు గూడ అట్టి కార్యములు చేయుటకు వెను దియ్యడని గ్రహింపవలెను. వాడు చేయు కార్యము లన్నింటిని మనము గమనింప జాలముకదా! మున్ను ద్రుపదుడు ఒక మారణహోమమునకు పౌరోహిత్యము చేయవలసినదిగా ఉపయాజిని ప్రార్థించి బహుమానముగా అసంఖ్యాక గోవుల నిత్తుననగా, అతడు నేసి పనిజేయను పొమ్మన్న వనచో, జేయగలడు అతని వరింపుమనెను. అది ఎట్లన ఒకనాడు తాళ్ళదువ్వుకు పోవునప్పుడు ఒక అపవిత్ర స్థలమున పడియుండిన పండొక్కటిని తాను గ్రంహింపనొల్లక పోగా అన్న గ్రహించెను కావున అతడీ పనికి రోయడని.

ప్రభువునకు ఇక్కట్టు కలిగినప్పుడు కీడు తలపెట్టిన వానిని ఆ ఇక్కట్టు తొలగివిజయము కలిగిన తర్వాత హింసింపకూడదు. వాని ఐశ్వర్యమును హరించిన జాలును. కోఱలు పెరికి వేయబడిన పాము ఎట్టి హానియు చేయ జాలదు. వాడు చావు తప్పినందుకు కృతజ్ఞుడై శత్రుత్వమును వదలి హితుడుగా వచ్చును.

రాజ్యవైశాల్యము అర్థసిద్ధికిమూలము. కాని రాజ్యము చిన్నదైనను ప్రభువు చెఱువులు కుంటలు కాల్వలు త్రవ్వించి పేదరైతులకు భూమి పన్నును తగ్గించి కోరు భాగములో వారికి అధికముగా నందజేసిన యెడల రాజ్యములో నర్థమును ధర్మమును పెరుగును. అధిక పన్ను లిచ్చుకోలేక ప్రజలు గృహారామములు ఊళ్లు దేశము విడిచి పరరాజ్యములకు వలసపోయిన యెడల వారిని ఒడబరచి మరల పిలిపించుకొనక వారు వెళ్లిపోయినదే చాలు

[illegible]

సామాను తమకు వంట చెఱకులగునని సంతోషించు ఉద్యోగులు యుద్ధ భూమిలో అశుభము కాంక్షించు నక్కలవంటివారు. అట్టి ఉద్యోగులు గల రాజు సప్త ద్వీపము లేలినను సమృద్ధిని బడయజాలడు.

రాష్ట్రాదాయములో రాజు తన త్యాగభోగములకొఱకు నాల్గింటి నొక పాలు మాత్రము వినియోగించుకొనదగును. సైన్యమునకు సిబ్బందికి రెండుపాళ్లు వ్యయపరచి తక్కిన పాలు భండారము చేర్పవలెను,

పరదేశ రాజుల ఎత్తుగడలను తన సచివుల వ్యవహారములను సార్వభౌముడు చారదృష్టితో కనిపెట్టుచునే యుండవలెను. తన రాష్ట్రమున తస్కరులు బందెపోటు దొంగలు లేకుండ తుడిచివేయవలెను. తలవరులను (పోలీస్) లాలించి పని గొనవలెను. ముచ్చు దొరికినప్పుడు వెంటనే శిక్షింపక తామసించినచో వాడు చెఱనుండి తప్పించుకొనిపోగా తమకు మాట వచ్చునని ఆ రక్షకులు వాని స్థానములో ఇంకొక్కని ఎవ్వనినో పట్టి యుంచెదరు. అట్టి నిర్దోషి శిక్షితుడైన యెడల, శిక్షితుడు కృశాంగి కావున కొఱతకు చాలడని ఆ యూరి పెద్దశెట్టిని స్థూలకాయుడు గావున కొఱతకు వేసిన రాజు వలె పరిహాస పాత్రుడగును.

రాజ్య వ్యవహారములను రాజు నాల్గింట మూడు పాళ్లు స్వశక్తితో తెలిసికొనవలెను, తక్కిన పాలు తన అభ్యుదయమును కోరు సుహృత్తతి వలన నెఱుగనగును. ఆగ్రహమును జెందక నీతివర్తనుడై పై విధముగా పాలన చేయు రాజు ఎప్పుడును అపద పాలుగాడు. దండపారుష్య వ్యసనము నకును జిక్కడు. అట్టి రాజు చిరకాలము రాజ్య మేలగలడు.

వృక్షాగ్రమున గూర్చుండి భల్లూకము ఒక కంటితో నిద్రపోవుచు రెండవ కంట జాగరంబు చేయుచుండును. ఆ విధముగనే రాజు భోగముల ననుభవించుచుండియు వెలి శత్రువులమీదను లోని ద్రోహులమీదను దృష్టి యుంచియే యుండవలెను.

యోగ్య పక్షపాతమున భిక్షులకు జడదారులకును అర్థమును ఊళ్లను రాజు దానము చేయునేని వారు తమ తమ వ్రతముల నుండి భిన్నులై భోగ లాలసులగుదురు. అట్లయిన యెడల దేశమున క్షామము రోగము తల చూపును, శిశుమరణములు కలుగును. కావున రాజు అట్టి సన్యాసుల యెడ భక్తి చూపు

అందువలన భూపతికి పాపము రాదు. ఇందులో ఎట్టి సంశయము నుండ నక్కఱ లేదు.

నేరము చేసిన వారి విజ్ఞాపనములు మూడు మార్లు మాత్రము గ్రహించి వారిని క్షమింపుము. అట్టి వారు పారిపోయి తనకు వెంటనే ఆపద ఘటింతురని సందేహించితి వేని వారిని ఆలస్యము చేయక తుదముట్టింపుము.

తానతిశూరుడైనను నృపుడు తన దొరల శూరాలాపములను ఓర్పుతో వినవలెను. అందువలన వారుఉబ్బి తమ శక్తికి మించిన పౌరుషము కనుబరతురు తన పరాక్రమము వంటి పరాక్రమమే తన దొరలందు కనబడుట మంచిదే కదా !

ప్రభువు సముద్రపు రేవులలో పరదేశీయుల ఓడలు నిలుచునట్టి సౌకర్యము తేర్పరచి జాతి గుఱ్ఱములు ఏనుగులు మణులు ముత్యములు శ్రీగంధము మొదలగు పరిమళద్రవ్యములు దిగుమతి యగునట్లు వాణిజ్యమును పెంచవలెను. పరదేశములందలి క్షామడామరములు కారణముగనో ఇతర ఇక్కట్లచేతనో ఆ దేశప్రజలు వచ్చిరేని రాజు వారిని చేరనియ్యవలెను. ఆయా జాతుల కుచితమగు రీతి వృత్తి వసతుల కల్పించి రక్షింపదగును.

తన తోటలు దొడ్లు పశువులమందలు సువర్ణలోహాదిగనులు ఎప్పటి కప్పుడు పరిశీలించుటకు ప్రభువు తన కాప్తులైన వారినే నియోగింపవలెను,

(సశేషము)

కవిత:

# వెలుగు బాట

— శ్రీ కందుకూరి రామభద్రరావు

నీలోన నిత్యమై నెగడు వెల్గుంబాట
పథికుడా! బ్రదుకంత పయనమ్ము సాగించు
పథము సన్నమెకాని, పదము తొట్రిలుకాని,
ఎదదనిబ్బరముతో నడుగు సాగుకొలంది
ఆనందమేపారి యందమౌ రహదారి,
ఆవెల్గు ప్రతిబింబ మఖిల జీవకదంబ
ముకురంబులో దాగు ముగ్ధమోహన కాంతి,
ఈవివేకమే పాంథహృదయాలఁ బండెనా,
నలుపు తెల్పనిలేదు, బలుపు బక్కనిలేదు
ప్రాక్ప్రతీచులులేవు, వాక్ప్రకర్షలులేవు
చిన్నపెద్దలులేవు, శీతోష్ణతలులేవు
అవనిపైఁబ్రజలంత యాత్రికులయ్యేరు
అనురాగ లతలెన్నొ యలరుల నెత్తంగ
వసుధగుబాళించు పరిమళంబచ్చేను;
నిష్కామకృషితరుల్ నిండుగా ఫలియింప
అన్నపూర్ణవచ్చి యార్ద్రితన్ బంచేను;
అభిలేశసత్రమై, యానందధామమై
సాగిపోదా ధాత్రి శాంతిచంద్రికలోన
సృష్టిలోసంతుష్టి ప్రస్ఫుటంబైదాక!



కథానిక :

# ఏటావలి గిలిగింతలు

– శ్రీ సాగరాల

'వెళ్దాం పదండి...టిక్కెట్లుకూడా కొన్నాను'

ఒక్కసారిగా అలా శాసించింది శాంత. ఆరు గంటలసేపు పోరాడి ఓ యంత్రాన్ని రిపేరుచేసి – ఆఫీసునుంచి పుట్టెడు అలసటతో వచ్చిన భాస్కర్‌తో అన్నమాట లవి. కాఫీ కప్పు టేబుల్‌మీద పెట్టి - నున్నగా గీచిన గెడ్డాన్ని చేత్తో తడుముకుంటూ - భార్యవేపు అదోలా చూసాడు - వెళ్లాల్సిందేనా - అన్న భావం కల్గేలా.

అతను ఓసారి రాలేనన్నాడు. ఏం? ఎందుకు? వంట్లో బాగోలేదా? తల నొప్పిగా వుందా? అలసిపోయిన వారికి సినిమాలు, నాటకాలు పూర్తి విశ్రాంతి నిస్తాయికదా? మరి రానంటారేం? – ఆ ప్రశ్నలన్నీ ఆవిడ అడగాలి. అతను మౌనం వహించి కూర్చోవాలి – పర్యవసానం – ఎడమొఖం పెడమొఖం—రాత్రి ఏకాదశి ఉపవాసం.

అలా జరుగుతుందనుకున్న భాస్కర్ విస్తుపోయాడనే చెప్పాలి— శాంత శాసించగానే, మహిళా మండలివారు ఎపుడో కట్టించబోయే స్కూల్ సహాయార్ధంగా ఏదో నాటకం ఆడిస్తున్నారట - ఈవిడకి రెండు టిక్కెట్లు తగలెట్టి నందుకు తను మూడు గంటలసేపు ఆ థియేటర్లో కూర్చోవాలి. ఏం కర్మరా బాబు! అసలు ఈ అధికార స్వాతంత్రాలు దీని కెవ రిచ్చినట్టు? ఇంకెవరు తనే! అయినా మహిళా సమాజంలో చేరింది మొదలు తన నెత్తి నెక్కి కూర్చోవాలనుకుంటోంది. ఎంత పొగరు! ఎంత ధైర్యం!! ఆఫీసు పని అవతలెట్టితే-యంత్రాలతో పోరాడి రెండొందలా యాభై రూపాయలతో బయటపడి వస్తూంటే—తిని తీరిగ్గా కూర్చోలేక ఏమిటీ సింగినాదం- పైగా దబాయింపొకటి నేర్చుకుంది-తన పురుషత్వం ఏమైంది!- అనుకున్నాడు. అదో మేల్కొంది. కళ్లు ఎరుపెక్కాయి - తన్నేద్దామని చెయ్యెత్తాడు-తీరా దగ్గిర కెళ్లాక చంపని మృధువుగా తాకింది చెయ్యి.

'అబ్బా, ఇపుడేమిటి మీ సరసాలు-రండి లాక్కెళ్లింది శాంత.

నాటకం పూర్తయింది – అయినా భాస్కర్ కుర్చీకి అంటుకుపోయాడు. శాంత జబ్బ చరిచేవరకు ప్రకృతిలో పడలేదు.

'మాశారూ…నాటక మెంత బావుందో' – అంది శాంత అన్నం వడ్డిస్తూ.

'పడ్చినట్టుంది' – ఒక్కసారిగా దులిపి పారేసాడు భాస్కర్.

చర్రున కోపంచ్చింది శాంతకి. 'అదే మీ మొగాళ్లకున్న జబ్బు – నాటకం పూర్తయినా అలాగే కుర్చీకి అంటుకుపోయారేం?'

సంజాయిషీ చెప్పుకోలేకపోయాడు భాస్కర్. అంతదాక బుర్రలో రేగిన సంచలనం ఓ కొత్త రూపంలోకి వస్తోంది – ఏవేవో గతస్మృతులు గుర్తుకొచ్చాయి – వాయు వేగమనోవేగాల్తో గత జీవితంలోకి పరిగెత్తటానికి మనసు తగిన బలాన్ని పుంజుకుంటోంది.

అన్యమనస్కుడైన భర్తని చూడగానే రెట్టించి అడిగింది శాంత.

'ఊ. వెధవ నాటకం పోనిద్దూ' – లేచాడు భాస్కర్.

*　　*　　*

ఆనందరావొక నాటక సమాజ స్థాపకుడు, కళారాధనే అతని వృత్తి బి. ఏ. డిగ్రీని మూల పడేసి జీవితమంతా కళారాధనకో–కళాయి రాధనకో అన్నట్టు ఉన్న ఆస్తినంతా–ఏాయ్యిమీద వెన్నలా తగలబెట్టున్నాడు. మూడు రోజులలోపల 'నాటకం' ఆడించాలని ఓ నెలనుంచి రిహార్సలు పెట్టిస్తున్నాడు. సమాజ సభ్యులంతా యథారాజా తథా ప్రజా–అందరూ నిరుద్యోగులే. ఏదో కాస్త కాలం గడుస్తుందని మొదట సరదాకి నటించారంతా. అది క్రమంగా కొంత కాలానికి వృత్తి క్రిందికి మారింది. కారణం – వాళ్లకి హీరోయిన్ హారతి దొరకటమే.

హారతి పాతికేళ్లలోపు అందమైన పిల్ల. చమత్కారి. అంతో ఇంతో చదువుకుంది. ఆమెని పొందాలని అందరూ ఆకాశమెత్తున ఆశతో పోటీ పడుతున్నారు. అందర్నీ తప్పించుకుంటూ చాటున నవ్వుకునే పిల్ల–హారతి. సౌందర్యంతోపాటు తెలివితేటలున్న గడుసరి. ఆమెకి ఎవరితోనూ మాట్లాడాలనే కోరిక ఉండదు. అవసరం వస్తే తనే మాటాతుతుంది– ఓ రకంగా మితభాషిణి. నవ్వందే ఆమె నోటినుండి మాటరాదు. అందరితోను సరదాగా మాట్లాడుతూ, చదువునంతా పూర్తిచేసుకుని ఉద్యోగంకోసం వేచియున్న వ్యక్తి–భాస్కర్. ఆ సమాజ కార్యదర్శి. ప్రస్తుత నాటకంలోని హీరో.

… … తెలివ … మో బయటికంత భయస్తుడి లాగుం

'మీకు హిందీ పాటలు కూ వస్తాయట' - రిహార్సలు రూం నుంచి రోడ్డుమీద పడ్డ భాస్కరాన్ని అడిగింది హారతి...సుముఖంగా నవ్వుతూ.

'అవును. కావాలా ?'.

'అన్నీ అక్కర్లేదు-'మధుమతి' లోని 'ఆజారే పరదేశీ'-అన్న పాట కావాలి'

'ఓ. ఇపుడే రాసిస్తాను '-అనడానికైతే అన్నాడు కానీ-ఆచిత్రంలో ఆపాట తప్ప తక్కినవన్నీ వస్తాయతనికి-చచ్చాంపో! ఆ రికార్డులు అమ్ముకునే రామయ్యకి టోపీ వేస్తేకాని రాసుకురాలేదు - కర్మరా బాబూ! అడిగి అడిగి అదే అడగాలా? కొండంత కోపం వచ్చింది హారతిమీద. గొంతులో వెలక్కాయ పడ్డట్టు గాబరా పడ్డాడు - ఎక్కడ అప్పుడే రాసివ్వమంటోందనని.

'ఇపుడెందుకులెండి- రేపు తీసుకురండి'

బ్రతుకు జీవుడా అని గుండెలదాక గాలి పీల్చుకున్నాడు.

'మరి మీరు నాకోపాట రాసివ్వాలి'

'ఏపాట?'

'అదే – మొదటి సీనులో పాడుతారు చూడండి...'

'సరే. రాసిస్తాను.'

మర్నాడు ఆదరాబాదరాగా వచ్చాడు ఆనందరావ్ – 'అంతా వచ్చారా' అంటూ'

'ఆ. ఆ హీరోమాత్రం పరా మామూలే' గొణిగాడు కృష్ణమూర్తి.

'నో–స్మోకింగ్' అన్న బోర్డుని ఎలకిందులు చేసి సిగరెట్ దమ్ము లాగుతోన్న నారాయణ, 'హీరో కదూ - కాస్త కివిగా దర్జాగావస్తాడు'- సణిగాడు.

'ఆ సిగరెట్లు అవతల పారేసి రెడీ అవ్వండి' – ఆర్డర్సు జారీచేశాడు ఆనందరావ్.

ఓ నిమిషంలో అందరూ 'రెడీ' అయ్యారు. ఫస్టు సీను ప్రారంభ మయిన పది నిముషాలకి నెమ్మదిగా అడుగెట్టాడు భాస్కర్. తను రంగంలో కెపుడెళ్లాలో 'డైలాగ్సు' నిబట్టి తెలుసుకుంటూ ఆనందరావ్ పక్కన నిల బడ్డాడు. 'యాక్ట్' చేస్తున్న హారతి - భాస్కరాన్ని చూడగానే చటుక్కున ఆగిపోయి - చేతిలోనున్న 'హ్యాండ్ బ్యాగ్' లోంచి కాగితాన్ని తీసి అతని

మీద పడేట్టు విసిరేస్తూ – 'ఆ అదుగో భాస్కర్' అంది. అందరితోపాటు ఆమె ప్రవర్తన భాస్కరానిక్కూడా ఆశ్చర్యాన్ని కల్గించింది. ఆఖరికి గోవు లాంటి ఆనందరావ్ కూడా తుళ్ళిపడ్డాడు. ఆ క్షణంలో భాస్కరాన్ని చూడ గానే కొండంత కోపం వచ్చిందేమో! అవునుమరి ఆడదాన్ని నలుగురిలో పట్టుకుని, 'అదితప్పు. రిహార్సల్ రూంలో–డైలాగ్స్ వల్లిస్తున్న సమయంలో 'మూడ్స్'ని వదిలి అలా 'లవ్ లెటర్' పడేస్తారా' – అడగటానికి ఎవరి కుంది ధైర్యం? ఆమె మీద కోపమంతా భాస్కర్ మీదకి తిరగబెట్టింది. 'చూడవోయ్! ఆ అమ్మాయి మూడ్స్‌కి అడ్డం వచ్చావ్. కడుపుకి తింటున్న పుడు కాస్త తెలివి వుండాలి. మీ లౌలెటర్లకి ఇదా సమయం! ఇదేం పబ్లిక్ పార్కో – బార్ హోటలో – కాదు. ఆనందరావ్ స్థాపించిన 'జ్యోతి ఆర్ట్స్ థియేటర్ తెలుసా' – ఉద్వేగ ఉద్రేకాలతో వణికిపోతూ అన్నాడు ఆనందరావ్.

సూదివేస్తే వినబడేటంత నిశ్శబ్దంగా వుండిపోయింది హాలు.

'మిస్టర్ భాస్కర్. మేమంతా నువ్వో గొప్ప కళారాధకుడవను కున్నాం.'–ఎత్తిపొడిచాడు నారాయణ.

భాస్కర్‌కి ఏమీఅర్థంకాలేదు. మళ్ళా ఏదో అర్థమైనట్టూ వుంది–ఇంతకూ తన మీద పడ్డ కాగితం చూసి, మూర్ఖులు – ప్రేమలేఖని అనుకుంటున్నారు కాబోలు. ఆ సమయంలో ఏం మాట్లాడాలో తెలియక బుర్రగోక్కున్నాడు 'చేసిందంతా నువ్వు, అలా నంగనాచిలా వుండి పోతావేం?' – హారతిని అడగాలనుకున్నాడు. కానీ తలెత్తి అటుకేసి చూపుల్ని పారేసే శక్తి లేక పోయింది.

'సారీమిస్టర్ ఆనంద్. ఆమెకి నేనే విధంగా అడ్డు వెళ్లలేదు – 'మూడ్స్' లోంచి విడిపోయి – మధ్యలో నాకేసి చూడటం ఆమె తప్పే కానీ, నాదెలా అవుతుంది? ఆవేపుకి చూడకండా నా పోర్షన్ ఎపుడొస్తుందో నని వైట్ 'చెయ్యటం – మీరే చూస్తూన్నారుగా.'

రెచ్చిపోయాడు ఆనందరావ్ – అతని స్వరం – స్వరూపం – అంతగా మారిపోవటం అదే మొదటిసారిగా చూసారంతా. 'నీలాంటి బ్రూట్స్ వుండ బట్టే సమాజాలంత అధోగతి పాలవుతున్నాయి. పైగా నీ తప్పు కాదంటూ సమర్థించుకో చూస్తున్నావెందుకు? చేసిందంతా నువ్వే – ఈ క్షణంనుంచి

మరో హీరోని తెచ్చి మూడోనాటికి నాటకం ఆడించకపోతే నేను పేరు మార్చుకుంటాను ........నువ్వింక వెళ్లొచ్చు......... గెట్ ఔట్.'

అతని వింత ప్రవర్తనకి నిశ్చేష్టుడయ్యాడు భాస్కర్. అందరిలో తల కొట్టినట్లు - 'బ్రూట్ - ఫూల్' - అని తెగతిట్టటంతో ఆత్మాభిమానం ముందుకి వచ్చింది భాస్కరానికి. ఏమైనా కలవారిబిడ్డడు కాబట్టి మాటపడటమంటే కాస్త కష్టమే. ఆనందరావు వేపు కూవ్యదృక్కుల్ని పారేస్తూ, 'థేంక్యూ సోమచ్ - అనేసి గబగబా వెళ్లబోయాడు. అంతవరకు మౌనం వహించిన హారతి భాస్కరాన్ని పిలుస్తూ, 'అదివ్వండి' అంది. ఆమె అడిగిందేమిటో అర్థంకాక తికమక పడి — తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో — 'సారీ' - అంటూ జేబిలోంచి పాటకాగితం తీసిచ్చాడు.

వారికే గుడ్లప్పగించి చూస్తోంది మిత్రబృందం.

వారంరోజులు గడిచాక - ఉద్యోగానికి ధరఖాస్తు పడేసి 'పోస్టాఫీసు' నుంచి మండుటెండలో తల మాడ్చుకుంటూ వెళ్తున్న భాస్కరానికి - రిక్షాలో ఎదురుగా వస్తున్న హారతి కనిసించింది — గుండె అవిరి పోయాయి - కాళ్లాడ లేదు - మైలురాయిలా నిల్చుండిపోయాడు.

'ఎక్కడికెళుతున్నారు ?'—రిక్షాని ఆపించి, నవ్వుతూ అడిగింది హారతి.

మునుపు జరిగిందంతా గుర్తుకురావటంతో - ఎక్కడలేని కోపం వచ్చిందతనికి — నాలిక ఊడికింద పడేవరకూ ఆమెని తిట్టి పోయాలను కున్నాడు — నోరెత్తకుండా గొంతు నులిపి పారేయాలనుకున్నాడు - రెండు జడలూ, లాగదీసి రిక్షా చక్రాలకి కట్టేసి ఈడ్చుకు పోవాలనుకున్నాడు — అన్నీ అనుకోవటమే కానీ ఆచరణలో పెట్టింది ఒకటీలేదు - కానీ భలే ఉక్రోషంగా జవాబిచ్చాడు. — 'వట్లోకి' అని.

'ఎందుకు ?'

ఆ ప్రశ్న వినగానే నిలువునా నరికి పారేయాలనిపించింది. అలా తెలిసుండి కూడా ఉడికిద్దామని అడుగుతుందేం ? అరికాలిమంట నెత్తికెక్కటంతో 'చావడానికి' - అని అరచాడు. 'చావడానికైతే అంతదూరం ఎందుకు ? మాఇంట్లో దానికి మంచి మందువుంది ఇస్తాను వస్తారా ?' — ఆప్యాయం వొలకబోస్తూ అంది హారతి.

ఈసారి ఆమెమీద ఆకాశమెత్తున కోపంవచ్చింది భాస్కరానికి. " దీని దుంపతెగ ! చచ్చినావదిలేట్టులేదు - అనుకున్నాడు. " ఎందుకూ ? ఉన్నవి

లేనివి కావాలని పుట్టించి ఆ థియేటర్‌లో దుమ్మెత్తి పోయించావ్ — ఇవా కాస్తా మిగిలిన నేను మట్టికొట్టుకు పోవాలనా - ఈ ఆహ్వానం !

'అబ్బో, భలే హాట్‌గావున్నారే. ఇలా కూర్చోండి. మాఇంటికెళ్దాం'— చెయ్యిపట్టి లాగింది, ఆ స్పర్శకి కళ్లు తిరిగిపోయాయి భాస్కరానికి — 'నేను రాను వదులు' - విసిరికొట్టాడామె చేతిని, హారతి పక్కన నవ్వుతూ, 'ఈ రోడ్డుమీద మనిద్దరం పోట్లాడుకోవటం బావుండదు. రండి' — అంటూ మళ్లా చెయ్యిలాగింది — అలా అంటున్నపుడు ఆమె పారేసిన తియ్యనిచూపుకి అయిసయ్యాడు.

'అబ్బే - మరో రిక్షాలో వస్తాను'

'అలా ఆడపిల్లలా సిగ్గుపడుతారేం? పక్కన కూర్చున్నంత మాత్రాన నాశీలం పాడుకాదురాండి' చుట్టుపక్కల చూసి ఎరుగున్నవారెవరూ లేరని నిర్ధారణ చేసుకొన్నతర్వాత - తప్పదన్నట్లు విధిగా ఆమెపక్కన వొదిగి కూర్చున్నాడు.

'ఇపుడు చెప్పండి కబుర్లేమిటో' - అతని చేతికో టీకప్పు అందించి - తానొకటి తీసుకొని ఓసారి చప్పరించి — తియ్యటిచిరునవ్వు విసిరేసింది హారతి,

'ఓయి భగవంతుడా! ఎంత ఇక్కట్టు తెచ్చిపెట్టావురా! ఈ కోరకరాని కొయ్య సులభంగా వదిలేట్టు లేదు స్వామి! అనాథరక్షకా! శరణాగతుడు వేడుకుంటున్నాడు — శీఘ్రంగావదిలేట్టు చెయ్యిదేముడా!' — ఆమెవాలకం చూసి కోటిదేముళ్లకి మొక్కుకున్నాడు. దరఖాస్తు పడేయటానికి పోస్టాఫీసు బారెడుదూరంలో వుంటే ఇంతసేపు ఎక్కడచచ్చావురా — నాన్నగారు ఉగ్ర నరసింహావతారం దాల్చినట్టు కళ్లకికట్టగానే తల దిమ్మెక్కిపోయింది-గుండెలు అవిసిపోయాయి — నీరు కారిపోయాడు. తమాయించుకొని, 'ఎండలు విపరీతంగా ముదిరిపోయాయి — అన్నాడు. మరోసారి — మీఇల్లు చిన్నదైనా బావుంది — అన్నాడు. ఈచీరలో నువ్వుచాల అందంగావుంటావ్ సుమా' — మూడోసారి అన్నాడు.

'అవేనా కబుర్లంటే' - కిలకిలా నవ్వింది హారతి.

ఆ నవ్వుకి అర్ధమేమిటో తెలియక విత్తరచూపుల్ని పారేస్తూ తనూ స్వరం కలిపాడు టీ తాగటం పూర్తిచేసి, 'నేచెప్తాను విను' - అంటూ చివాలున లేచి - అతనిమీద పడేంతదగ్గిరలో నిలబడి - కళ్లలోకి గుచ్చిగుచ్చి

నమ్మలేకపోయాడు - 'నిజంగా'

'నిజం'

'ఎం... కొచ్చావ్ ?'

'ఏమో నాకే తెలియదు - నువ్వులేంది అక్కడ నాకేదో చప్పగా వుండేది — ఉత్సాహమేపుండదు రక్తానికి'

'ఎపుడొచ్చావ్ ?'

'ఆమర్నాడే'

'అయితే వాళ్ళనాటకం విషయం' -

'టికెట్లు కొన్నవారంతా ఆ థియేటరుమీద విరుచుకు పడ్డారుట — ఆనందరావు ఆచూకీ ఇంతవరకు లేదుట — ఎక్కడికి పారిపోయాడో ?'

'దీనికంతా నువ్వేకారణం హారతీ !'

మిత్రబృందమంటే ఇంకా ప్రేమతగ్గని భాస్కరాన్ని చూడగానే - నిండు హృదయంతో నవ్విందామె.

'ఆనాడు అది పాటండి - లౌలెటర్ కాదని ఎందుకు చెప్పలేదు ?'

'బాగుందీ వరుస ! కారకురాలవి నువ్వు - ఏమీ ఎరగనిదానిలా మాట్లాడుతావేం ? అయినా మొగాడు నిజంచెప్పినా నమ్ముతుందా లోకం ?'

ఓ నిముషం నిశ్శబ్దం. 'ఆమాట నువ్వే అనివుంటే నీకొచ్చిన నష్టమేముంది ?'

'నిజంగా చెప్పనా ! వాళ్ళంతా అలా అనుకోవాలనే నేను మౌనం వహించింది.'

'ఎలా అనుకోవాలని ?'

'ఇలా'— అతని నుదురుని ముద్దెట్టుకొని లోపలికి పారిపోయింది హారతి.

బంగారు ఉయ్యాలలో కూర్చొని - ఒక్కసారిగా అండపిండ బ్రహ్మాండమంతా పర్యటించి వచ్చినంత ఆనందాన్ని — అదోలాంటి అనుభూతిని పొందాడు భాస్కర్, చాలాసేపటికిగానీ తన్ను తాను తెలుసులేకపోయాడు. ఇదా తంతూ ! ఓరేయ్ భాస్కరం ! అసలు జీవితంలోనే హీరో అవిపించుకున్నావ్ - ఓ లక్షన్నర తాజమహాళ్ళని ఓ క్షణంలో మనసులో కట్టించి పారేసుకో — అల్లా షాజహాన్ పేరు ఈ దెబ్బతో ఊడ్చుకు పోవాల్సిందే- హారతి కోసం ఆకాశ మెత్తున ఆశా సౌధాల్ని నిర్మించాలను కున్నాడు.

'ఏం చేస్తున్నావ్ ?' — లోపలికెళ్ళి అడిగాడు మృదువుగా—అప్పుడే తనావిడైనట్టు భావించుకున్నాడు వెర్రినాగన్న !

వంట చేయటానికి సిద్ధమవుతోందామె — ముందర కూరలబుట్ట పెట్టుకోని నేలమీద కూర్చున్న హారతి - తలెత్తి అతన్ని ఒసారి పరికించి — అంతలోనే సిగ్గు ముంచుకు రావటంతో — తలొంచుకుంది సన్నగా నవ్వుతూ.

'అమ్మదొంగ' — అంటూ ఆమె రెండు భుజాలు పట్టుకు ఊపాడు భాస్కర్, కానీ ఎదురుగ్గా వున్న వ్యక్తి కనిపించలేదు కళ్ళకి - మత్తెక్కిపోతోంది మనసు - శరీరం వణకటం మొదలెట్టింది — నరాలు నృత్య భంగిమలో నిలబడ్డాయి - ఏంచేస్తాడో, ఏంచేసాడో — కళ్ళు తెరవగానే ఆమె వడిలో పడుకోని వున్నాడు - హారతి కిలకిలా నవ్వుతోంది - ఓ చెయ్యి అతని జుట్టులోకి దూర్చి - కుడిచేతి వేళ్ళతో అతని పెదాలని తాకుతూ — 'నా మీద ఇంత ఆశ పెట్టుకున్నట్టు ఒక్కనాడైనా చెప్పావ్ కాదేం ?' అంది.

జవాబు చెప్పలేదతను. 'ఈ ఇంట్లో నీ వొక్కదానివే వుంటున్నావా ?' - చేతిగాజుల్ని సవరిస్తూ అడిగాడు.

'నేను — మా అమ్మ వుండేవాళ్ళం - కానైతే అది ఎవడితోనో లేచిపోయి రెణ్ణెల్లవుతోంది — ఇంతవరకూ పత్తాలేదు.'

ఉలుక్కుపడ్డాడు భాస్కరం — క్షణంసేపు పహ్యభావంతో చూసాడామెని — రెండో క్షణంలో ఎక్కడలేని అవ్యాజమైన జాలి చూపుల్ని పారేస్తూ, 'పాపం ! మరి నీ గతి' — అన్నాడు.

'నా గతి అధోగతే'

ఓ రెండు నిముషాలు నిశ్శబ్దం. నీ మూలాని ఆ సమాజం లోంచి వచ్చేసాక మరీ కష్టంగా వుంది - చచ్చి ఏ లోకాన వున్నాడో కానీ నాన్నగారి దయవల్ల నేర్చుకున్న ఆ సంగీతమే నా కిపుడు జీవనాధారమయ్యింది. ట్యూషన్ల వల్ల ఓ ముప్పయి రూపాయలొస్తాయి.'

'ఈ స్పుత్నిక్‌ల యుగంలో ధర్టీరుపీస్ ఏ మూలకి చాలుతుంది ?'

'ఏంచెయ్యాలి చెప్పు ! ఉద్యోగం చేద్దామంటే పెద్దగా ఏమీ చదువుకోలేదు '—

భాస్కర్ గట్టిగా నిట్టూర్చి — ఓ నిముషంసేపు ఆలోచించి,' — పై

ఎక్కడలేని కోపంతో కళ్లెర్రజేసి — తలని రెండు చేతుల్తో ఎత్తి అవతలకి తోసేసింది. నేలకి తగిలి ‘దన్’మంది — భాస్కర్ తల ఆ దెబ్బకి గిర్రున తిరిగిపోయి చెవుల్లో పోటు లేచింది — పక్కనేవున్న కూరల కత్తికి అతని చిటికెన వేలు తెగి రక్తం ధారలు కట్టసాగింది — చివాలున లేచిన హారతి అవంతా గమనించనే లేదు— ఆ వెళ్లేటప్పుడన్న మాటల్లో ఎంతకోపం— ఆత్మాభిమానం వుందో తేలిగ్గానే తెలుసుకున్నాడు.

‘శరీరంమీద బతికేదాన్నయితే ఈపాటికి తాజమహల్ లాంటి భవనం కట్టించేదాన్ని.’

తస్సదియ్యా— ఎంతపని జరిగింది! ఈవిడింత నీతిపరురాలని — ఈ కత్తికింత పదునుందని తెలియదే— అబ్బా! ఇప్పుడేమిటి చెయ్యటం? ఏమిట్రా ఆ రక్తం— అని నాన్న అడుగుతేనో? — పోనీ అమ్మ అడిగినా ఏం జవాబు చెప్పాలి? దొడ్లో చింతచెట్టుమీద ఓ కోతి వుంటోంది — అది కరిచిందని బొంకితే డాక్టర్ని పిలుచుకొచ్చి ఓ వెయ్యి ఇంజక్షన్లు పొడిపించరూ — అమ్మో బాబోయ్ — దానికంటే నిజం చెప్పడమే నయం. ఏమని హారతి యింట్లో చెయ్యి కోసుకుందనా? ఎవరా హారతి — ఏమా కథా— అని నాన్న గర్జిస్తే లేచిపోయినదాని కూతురు— నాటకాల్లో వేషాలేస్తుందినాలి — డొక్కచీల్చి డోలుకట్టమా నాన్న! అరె కుంకన్నర కుంకా— నీ కెలా జతయిందిరా అని అమ్మ నెత్తి నోరు బాదుకుంటుందేమో!

‘అరె అదేమిటి రక్తం! వేలు తెగిపోయినా — చీముకట్టినట్టయినా లేదే నీకు — ఇలా కూర్చోకపోతే నన్ను పిలవలేకపోయావ్’ లోపలికొచ్చిన హారతి ఆశ్చర్యపోతూ— రుసరుసలాడుతూ — తడిగుడ్డతో రక్తమంతా తుడిచి కట్టుకట్టింది. దాదాపు పది నిమిషాలు గడిచాక మౌనంగా మాటాడకుండా— ఆమెవేపు చూడకుండా— కదిలాడు భాస్కర్ — హాలులోకెళ్లాడు— వీధి తలుపు దగ్గిర కెళ్లాడు కూడా.

‘ఇదుగో భాస్కర్’— అతన్ని సమీపించింది.

ఆగాడు కానీ తిరిగి చూడలేదు

‘కోపం వచ్చిందా?’

జవాబివ్వలేదు.

దీనాతిదీనమైన చూపుల్ని విసరేస్తూ, ‘ఇలా జరుగుతుందనుకోలేదు భాస్కర్’ అంది.

జీరవోయిన స్వరం వినపడగానే ఆమె మొఖంలోకి చూశాడు భాస్కర్. ఓ క్షణంలో కోపం - మరో క్షణంసేపు తనమీద తనకే జాలి- ఇంకో క్షణంసేపు ఆమెమీద అనురాగం అంతలో కసరట -అంతలోనే ఆప్యాయత చూపుకోవటం-ప్రేమికులకి సహజమేనా! అనుకున్నాడు. హారతి నడుముచుట్టూ చేతులేసి, 'ఇంక మనం మాటమాటకి అలిగి కూర్చోకూడదు' అన్నాడు - ఎవరిదా గొంతు? తన గొంతులో అంత మార్దవముందా? తనని తానే ప్రశ్నించుకొన్నాడు.

ఆమె కనుకొనల మీదున్న కన్నీటిని తుడుస్తూ - 'ఎందు కేడుపు?' అడిగాడు కళ్లలో కళ్లుపెట్టి.

హారతి క్షణంలో తేరుకొని—నవ్వు తెచ్చుకుంటూ - జవాబుగా అతనికి తన పెదవు లందించింది. అతనా సమయంలో-భాస్కర్ కాదు ... ఆమె హారతికాదు...

తర్వాత రోజు భాస్కర్ నెల్లూరు వెళ్ళాల్సి వచ్చింది-అక్కడినుంచి హైదరాబాద్ వెళ్ళాడు— ... నాలుగోరోజున ఎక్కడ లేని ఉత్సాహంతో ఇంట్లో అడుగెట్టాడు. 'టెలిఫోన్ ఇండస్ట్రీ'లో ఉద్యోగమైంది - రెండు రోజుల్లో బెంగుళూరు వెళ్ళాలని తీర్మానించుకున్నాడు — హారతిని కూడా వెంటేసుకుపోవాలని. కానీ ఆతననుకున్న పథకం తలకిందులైంది - కథ అడ్డం తిరిగింది — హారతి ఇల్లు బంద్ — తలుపుకి తాళం. ఎవరినైనా ఏమని అడగుతాడు? తన కేవరని ఆవిడ? అప్పటికి స్వాభిమానంతో - పక్క డాబా లోనివారి నడిగాడు-వార్త వినగానే నీరైపోయాడు. తన చెవులని తాను నమ్మలేకపోయాడు. 'ఎవడితోనో లేచిపోయిందట' ఊహు—అబద్దం—హారతి ఎన్నటికి ఆ పని చెయ్యదు—ఏదో శక్తి ఎక్కడినుంచో ఘోష పెడ్తోంది. తన మనసులో.

కళ్ళల్లో వత్తులేసుకుని ఉన్న రెండు రోజులు హారతికోసం నిరీక్షించాడు - నిష్ఫలమైంది—నిరాశ చెందాడు. గుండె చెరువైంది—నిట్టూర్చాడు. సమ్మెట పోటులతో హృదయం ఎండగాలిపోయింది—నిస్పృహా చెందాడు. శరీరం తపించింది — నీరసించిపోయాడు. కళ్లు లోతుకుపోయాయి — కలత చెందాడు, మొహం పీక్కుపోయింది — మారింది మనసు — బాధల్తో బరు వెక్కింది. అద్దపు నీడల్లోని హారతి ప్రతిబింబం-ఎండమావుల్ని చూసి నీళ్ళను

చుక్కానిలేని నావలా — కృష్ణుడులేని భారతంలా — సారథిలేని రథంలా — ఇంజన్‌లేని రైలులా - తాడులేని బొంగరంలా — ప్రయాణమయ్యాడు బెంగుళూరికి. పొయ్యిమీది పాలు విరిగినట్టు మనసు విరిగిపోయింది - చిలుకపలుకులకి మోసపోయాడు - భామ దగా చేసింది - తగిన శాస్తే జరిగింది. 'బుద్ధి తెచ్చుకు బ్రతకరా బాబూ ! ఏమోయ్ భాస్కరం — ఆడది నవ్వుతూ పలకరిస్తే ఇహనైనా చంకలుకొట్టుకు ఎగిరిగెంతకోకు - గోతిలోపడతావ్ .....జాగ్రత్త ......' అనుకున్నాడు. అయినా. తన వస్తువులోని లోపం ఎవరూ బయట పెట్టరు - గొల్లది తన పెరుగు పుల్లదని చెప్పదు — తను కట్టుకున్న అద్దాల మేడలోకి — తాజమహల్‌లాంటి భవనంలోకి — పారిపోయిందేమో ! ఎవరి తోటి ? ఎవరతను ? — తనకంటే అందగాడా ? పరదేశీ కాబోలు — తనని బాగా ఎరుగున్నదేగా - తను పనికిరాడు. దగ్గిరవస్తువులకి గౌరవమేముంటుంది ? — దొడ్లోనికోడి పప్పుకూరలోకి పనికివచ్చినట్టు ! తనేదో దాహం తీర్చుకోవాలనుకున్నాడు - తియ్యని పానీయమని. కానీ హిమాలయాల్లోని మంచుని నాకితే దప్పెలా తీరుతుంది ? బురదగుంటలో తొందరపడి అడుగెట్టలేదు — నయమే. తనని రక్షించిన భగవంతుడికి - పడుకోట్ల నమస్కారాలనుకున్నాడు.

అతనిలో కొద్దిభాగం తప్ప హృదయమంతా ఆక్రమించుకుంది ద్వేషం. అంతలో ఏదో శక్తి ఏకరువుపెడ్తోంది - ఆవిడ ఏనాటికైనా అతనిదేనని - మళ్ళా అంతలోనే ఆశలు మొలకెత్తాయి - కట్టుకున్న గాలిమేడలు - ఆశాసౌధాలు కళ్ళముందు మెదలటం — పునాది దెబ్బతినకుండా జాగర్తపడుస్తూ కాపలాకాస్తున్న అజ్ఞాతశక్తి — ఏమిటీచిత్రం — తనలోనే రెండు ఆత్మలు - ఏ డాక్టరో—ఫిలాసఫరో — కొంపతీసి ఏనిపెట్టాడంటే — బుర్రగోక్కుని బద్దలు కొట్టుకున్నా అర్థంగాదు—థియరీ రాయటానికి- విషయం తేల్చక తనని మాంత్రికుడంటారేమో ! ఒక్కస్పర్శకే ఎన్నో ఉద్యానవనాలు వెలిసాయి - ఒక చూపుకే స్వర్గసౌఖ్యాలతో తలమునకలైనాడు — ఒక్క ఆలింగనక్రీడకి కృష్ణుణ్ణి తలదన్నిపోయాడు - తనామెని మరచిపోవటం దుర్లభం - తన శక్తికి మించిన పని......నిజంగా శాశ్వతంగా ఆమె తనదే - ప్రపంచంలో ఎక్కడున్నా ఏంచేస్తున్నా - ఎంతమందిలో వున్నా - తనని మాత్రం మననం చేసుకొంటూ వుంటుందామె .....అది యథార్థం - ఏనాటికైనా తనామెని కలుసుకోవటం. ఎందుకూ ? తనదగ్గిరకే వెదుక్కుంటూ రాదూ ;

వెర్రిమొర్రి ఆలోచనలతో - పిచ్చిగా ఎవరికోసమో ఎదురుచూస్తూ న్నట్టు - నింగినుంచి నేలకి - నేలనుంచి - నింగికి - ఆశానిరాశల ప్రవాహంలో పడికొట్టుకు పోతూ - గడిపాడు అయిదు సంవత్సరాలు...... కానీ అతని కోర్కె ఫలించలేదు...... అతననుకున్న వ్యక్తి కనిపించలేదు.

* * *

బారెడు పొద్దెక్కాక లేచాడు భాస్కర్. కాఫీ ఫలహారాదులు ముగి సాక ఆఫీసుకెళ్ళటం - మధ్యాహ్నం శాంత పంపిన క్యారియర్ భోజనం - సాయంకాలం తిరిగి గూడు చేరుకోవటం - గడియారం నడుస్తున్నట్టు - అదే జీవితంలాగుంది.

ఒకనాడు సాయంత్రం ఆరింటికి తిరిగి ఇంటికి గొచ్చాడు భాస్కర్. డ్రాయింగ్ రూంలో శాంత ఎవరితోనో మాట్లాడుతోంది. అతన్ని చూడగానే గబగబా బయటికొచ్చి లోపలికి లాక్కెళ్ళింది.

'రాత్రి నాటకంలోని హీరోయిన్ ...... పేరు హారతండి' — భర్తని కూడా ఆమెకి పరిచయంచేసింది శాంత. కాళ్ళకింద భూకంపమయ్యింది భాస్కరానికి - తుళ్ళి పడ్డాడు.

'నమస్తే' — సుముఖంగా నవ్వు విసరింది హారతి. సొట్టలుపడ్డాయి బుగ్గలు—కళ్ళలోని చిలిపితనం మాయమైంది — ఏదో భావగర్భితమైన చూపు, లావైన నడుం — బాగా నలిగిన పుష్పం — కాల్చి పారేసిన సిగరేటు పీక— ఎందరో విశ్రాంతి తీసుకునే వైటింగ్ రూం — ఎందరో మీటిన సప్తస్వరాలు పలికే హంపీ శిధిలాల్లోని స్తంభం — ఎవరో తాగి సగం విడిచేసిన ఎంగిలి షర్బత్ — అయిదేళ్లలో ఎంతమార్పు - దాన్నంతా శరీరంద్వారా బయట పెట్టిన రిమార్కు.

'ఇపుడేవస్తాను' — అన్న శాంత మాటలు ఆ ఇద్దరికీ వినబడలేదు. కానీ ముద్దాయిల ముందునుంచి జడ్జి తప్పుకున్నట్టుంది వారికి.

'బావున్నావా' - ఎండిపోయిన బావిలో అనుకోకుండానే నీటి బుగ్గ పుట్టినట్టు — గొంతు పెగిలివచ్చిందా పలుకు.

'ఏమో అనుకున్నాను — మొంచి అందెకత్తెని పెళ్ళి చేసుకున్నారే!'

'నీ కంటేనా'

'మ్చ్ - ఎంత అందముంటే ఏం గుణం లేకపోయాక' -

'నేను మారిపోయానా ?'

'ఊఁ - కనిపిస్తున్నదాన్ని కొండలెక్కి చూడాలా ?'

'మీరు మాత్రం — చాలా తీసిపోయారు !'

కథల్లో, సినిమాల్లో లాగు - హృదయం భగ్గుమనలేదు — అగ్నిపర్వతాలు గుండెల్లో బ్రద్దలవలేదు — అడుగంటి పోయిన ఆశలు చిగురించక పోయినా అదోలాంటి అనుభూతి కలిగిందామెని చూడగానే — నిరాశ, నిస్పృహ నిస్సహాయతల్ని శుభ్రంగా తుడిచిపెట్టేసింది నిర్దయ - నిర్లిప్తంగా ఆమెకేసి చూడటం తప్పితే మరేలాంటి భావం లేదా తనలో. గలగలమని పారే సెలయేరును చూస్తున్నట్టు - తనది కాని ఓ అందమైన కారుని చూస్తునట్టు— చేతులమీద వేలు వేలు తిరిగే బ్యాంకు గుమాస్తాలా - అదోలాంటి సంతృప్తి ఆమెని చూస్తే.

'మిమ్మల్ని పోల్చుకోలేక పోయాను - చివరికి స్వరం చూసి సందేహం తొలగింది.'

'ఎందరో మహానుభావుల్లో ఎన్నోవాడినో మరి నేను ?'

చివుక్కుమంది శారతికి. ఏదో మాటాడబోయి శాంతని చూసి ఆగిపోయింది.

ట్రేలో బిస్కెట్లు, కాఫీ కప్పులు పెట్టుకొని వచ్చింది శాంత. 'అలా బెల్లంకొట్టిన రాయిలా కూర్చోకపోతే అవిడతో ఏదైనా మాటాడకూడదూ? ఇంటికొచ్చిన అతిథుల్ని ఇలా అవమానిస్తారేం ?' — అన్నట్టు భర్త వేపు చుర చురమనే చూపుల్ని పారేసింది.

గతస్మృతుల్ని తోడేస్తోంది మనసు. కాలాతీతవ్యక్తితో తన స్నేహం-కాఠిన్యమంతా నిండిన పాత్ర - అని తెలుసుకోలేక కరుణకోసం వెదికితే - హృదయానికి రంపపుకోత - శిలాశాసనంలా శాశ్వతంగా నిలిచిపోతుందేమోనని ఒకానొకప్పుడు అనుకున్నాడు...... అదిప్పుడు చూచాయగా కనబడుతోంటే నిట్టూర్పు తప్ప - హృదయాన్ని స్పందించి పారేసే మార్పుకి రాలేదు - బాధ, దుఃఖం, కన్నీళ్లు తనలో మృగ్యం- వుంటే ఏవీ కనిపించవేం ? ఇలాంటి సంఘటనలకి 'డిస్పాయింటెడ్ హీరోస్' ఎందరో - బంగాళాఖాతమంత బాధతో - సప్త సముద్రాలంతటి దుఃఖంతో - రెండుకోట్లన్నర నంగల్ డామ్సులంతటి కన్నీళ్లతో - ఏడ్చి, మొత్తుకుని, తపించి, నశించి, కృశించి, చిక్కి, శల్యమై, జీవచ్ఛవాలై పోతోంటే-మరి తనకేం చీమకుట్టినట్లైనా లేదు ?-

అయితే తనుకఠినుడు - తన హృదయం పాషాణం - గుండెలనిండా ఘూర్ణైన గరళం.........!

అల్పాహారవిందు ముగిసింది. కాసేపు లోకాభిరామాయణం మాటాడు కొన్నాక - శెలవు తీసుకొని లేచింది హారతి - ఎదురుగదిలో కూర్చున్న భాస్క రాన్ని ఉద్దేశిస్తూ, 'నన్ను మా బసదగ్గిర దిగబెట్టి వస్తారా' అంది గట్టిగా.

ఎందుకో, ఉన్నట్టుండి, తనకి తెలియకుండానే అనేశాడు - 'పదండి వెళ్దాం' - లేచాడు భాస్కర్, మరోసారి శాంతకి నమస్కరించి హారతి రోడ్డు మీద కొచ్చింది.

ఓ ఇరువై గజాలు నడిచి-సందుమలుపు తిరిగాక మెయిన్ రోడ్డు వచ్చింది.

'ఆటోని' కేకేశాడు భాస్కర్ - అంతవరకు మౌనంగావున్న హారతి అతన్ని సమీపించి - కుడిచేతిని తన మునివేళ్లతో తాకుతూ, 'బస్సులో వెళ్దాం' - అంది.

అతను జవాబు చెప్పకుండా 'ఆటో' ఎక్కాడు - విధిగా ఆమె అతన్ని అనుసరించింది.

సిగరెట్టు వెలిగించి - దమ్ములాగుతూ, 'ఎక్కడనుంచి వూడిపడ్డావ్ ?' అడిగాడు భాస్కర్.

ఆ సమయంలో అలా అడగాల్సిన ప్రశ్నలు పదివేల పైచిలుకు వున్నట్టు పసికట్టింది హారతి - సన్నగా నవ్వుతూ, 'బెజవాడనుంచి - అక్కడో నాటక సంఘంలో వుంటున్నా' అంది.

'వాడ్ని వదిలేశావా ?'— ఉండ బట్ట లేక అడగిన రెండో ప్రశ్న.

'ఎవరు?'— ప్రశ్న అర్థమై మనిషి ఎవడైందీ తెలియక అడిగింది.

'నిన్ను లేవ దీసుకు పోయాడటగా'

'రామరామ ! మీరెలా నమ్మారు నే లేచిపోయినట్టు-నా పొట్టకూటికి తంటాలు పడి చస్తోంటే-అలాంటి వార్తలు-పిచుక మీద ఫిరంగి కాల్పులు-ఎలా నిజ మనుకున్నారు? ఇంతవరకు మీకు అందరికంటే ఓ ప్రత్యేకమైన స్థానమిచ్చాను-అయితే అందరితోటి జతయ్యారన్న మాట' అంది ఒక్కసారిగా.

ఇహ ఏం మాటాడుతాడు భాస్కర్? మౌనంగా సిగరెట్టు కాల్చుతో వుండి పోయాడు. ఏదో అణచుకోలేని బాధ-దుఃఖం గొల్లులికి వస్తున్నాయి.

రని నేను కలలో కూడా అనుకోలేదు-లేని పోని ఆశల్ని కల్పించి నామనసు దోచుకొని - దొంగలా పారిపోయి ఇపుడు నన్నే దబాయిస్తున్నారేం? మీ కోసం ఎన్ని రాత్రిళ్ళు పడ్డానో-ఎన్ని పగళ్ళు చూచానో-మీకేంతెలుసు? ఇక్కడున్నట్లు కనీసం కార్డు ముక్కైనా నా మొహాన పారేయ లేక పోయారు? పోనీ పెళ్లి చేసుకుంటున్నానని కానీ-పెళ్ళి రోజున కానీ-వచ్చి చెప్పటానికేం? అసలటువేపుకైనా తొంగి చూసారా? మీరు పెళ్ళి చేసు కుంటా నంటే మిమ్మల్ని పట్టి బలవంతంగా ఆపగలనా చెప్పండి-మీ పెళ్ళి రోజున నేనా వూళ్లోనే వున్నాను తెలుసా! పది మంది చేరితే పదికొక మాటంటారు - లేచిపోయిందనో - చచ్చిపోయిందనో-అమాంతంగా నిజమని వూరుకుండి పోవటమేనా? మా అమ్మ బెజవాడ నుంచి వుత్తరం రాస్తే చూట్టాని కెళ్ళి వారంరోజుల్లో తిరిగొచ్చేలోపల ఎన్ని పుకార్లు - ఎన్ని మార్పులు-' ఆగింది భారతి.

'ఆ. పోనిద్దూ-జరిగిందంతా మరిచి పోవాలి కానీ ఇలా తప్పుకో కూడదు'-బుజ్జగింపు, ఓ దార్పులతో నిండిన కంఠమది.

'అంతే లెండి-గట్టుమీద కూర్చొని ఎన్ని కబుర్లయినా చెప్పొచ్చు-నీళ్ళలో మునిగి పోతోంటే బావి నీళ్ళు చాలా తియ్యగా వుంటాయని అనటమేగా మీర నేది చూడా! నిక్షేపంగా సంసారం చేస్తున్నారు. అందుకైనా సంతోషపడుతున్నాను-పదో మీరైనా సుఖపడుతున్నారు.'

జీర పడ్డ స్వరం వినబడగానే అటుకేసి చూసాడు భాస్కర్ - కానీ మాటాడటానికి స్వరం చిక్కలేదు-గొంతులో తడారి పోయింది-పెదవులు మాత్రం కదిలాయి-చేతిలోని సిగరెట్టు జారి పడింది.

వాళ్ల బస వచ్చింది - 'అటో' ఆగింది - ఇద్దరూ దిగారు.

'ఇంకా వుంటారా ఇక్కడ?'

'తెల్లారి వెళ్తున్నాం - ఏం?'

'ట్రూప్ తోకూడా వెళ్లాలా? మరో వారంరోజులు ఆలస్యంగా వెళ్లొచ్చా!'

'ఎందుకిక్కడ? ఎవరున్నారని?'

'నాకోసం భారతి'

లోపలికి దారితీస్తూ - భారతి చిరునవ్వు విసరింది. 'బావుంది. అప్పుడంటే పెళ్లి కాలేదు కనుక మనకెన్నో చిల్లర కోర్కెలు - ఇపుడు

మీకేం తక్కువైంది? హాయిగా శాంత వుండిపోయాక మధ్య నేనెందుకు ?'

ఏం చెప్పాలో తెలియక బుర్ర గోక్కున్నాడు భాస్కర్.

'ఆ రోజున తల్లిని చూట్టానికెళ్తేనే - లేచిపోయిందని పుకార్లు పుట్టించారు - ఇపుడిక్కడున్నానంటే - పచ్చని సంసారంలో చిచ్చు పెట్టానని - పైగా మీకు స్పర్థలేర్పరచానని లక్షన్నర అభాండాలు నా నెత్తిన రుద్దరూ లోకం...వద్దుబాబు! ఆ పాపమంతా నేను తగిలించుకోలేను - ఈ తిరుగుళ్లు మానుకొని వుంటావా సరేసరి - లేదా శాంతతో చెప్పి కాలు కదపకుండా వుండేలా 'లాకప్' చేయిస్తాను.'

ఏమంటాడు భాస్కర్? అసలు అంతవరకు ప్రాణాలతో వున్నాడంటే గొప్ప కాదూ! భయపడ్డాడు - బిత్తర చూపుల్ని పారేసాడు - దీనంగా మొహం పెట్టాడు ఆఖరికి!

గదిలో అడుగెట్టాక, లోపల ఎవరూ లేకపోవటం చూసి - ఆమె రెండుచేతులూ పట్టుకొని, 'నాలాంటి కర్కశ హృదయుడు మరొకడుండడు - నువ్వేం మనసులో పెట్టుకోకు హారతి' అన్నాడు క్షమాపణలా.

హారతి కోపం పుటుక్కున ఎగిరిపోయింది - కరిగింది హృదయం - గుండెల్లోంచి జాలి పుట్టుకొచ్చింది అతనిమీద 'ఛా. ఇదేమిటి - ఆడపిల్లలా-' చెంపలు తుడిచి, 'కూర్చో, కాఫీ పట్టుకొస్తాను' - అని వెళ్లిపోయింది.

ఆమెని అలాగే దగ్గరకి తీసుకొని తనలో ఐక్యం చేసుకునేటంత గట్టిగా కౌగిలించుకున్నాడు భాస్కర్ - రెండు క్షణాలసేపు అతని కౌగిట్లో ఊపిరి తిరక్క తన్నుకులాడింది హారతి. అతికష్టంమీద బయటపడి - గాలి పీల్చుకుంటూ, "హమ్మయ్య!" అని నిట్టూర్చింది. 'ఒకానొకపుడు' ఈ నేను నీకోసమే పుట్టానని - ఈ శరీరంమీద సర్వహక్కులు నీవేనని అనుకున్నాను - ఇపుడు నేను పుట్టింది 'కళ' కోసమని తెలుసుకున్నాను - ఈ శరీరం నీకు గాక అన్యులకే అంకితమవుతోంది. నా దురదృష్టం. విధివింతల్ని తల్చుకుంటే నిజంగా భయమేస్తుంది - ఇంకా నేనెలా బ్రతుకున్నానో అర్థమవటంలేదు - అయితే ఒకటి మాత్రం అర్థం చేసుకొన్నాను - ఇంతవరకు మనం ఒకరినొకర్ని కోరుకున్నాం - ఇహానుంచి ప్రేమించటం నేర్చుకోవాలి-

అయితే ఆ మాటలంటున్నపుడు ఆమె చెక్కిళ్లమీదుగా కారుతున్న కన్నీళ్లని అతను చూసేవుంటే పరిస్థితులెలా మారివుండేవో? నెయ్యికోసం వేలు చక్కగా ముంచితే లాభంలేదు - కాస్త వేలు వొంచందే నెయ్యిరాదు పైకి - అనుభవహీనుడు భాస్కర్, చేతికందిన పిట్టని గాలికొదిలేశాడు - లిప్తపాటులోనే అది గగనానికి ఎగిరిపోయింది.

మౌనాన్ని భరించలేక హారతి బయటకెళ్ళి - పదినిమిషాల్లో తిరిగొచ్చింది - కాఫీ కప్పుతోటి. కానీ అతను కాఫీ త్రాగలేదు — సిగరెట్టు వెలిగించి లేచాడు.

'గాలిపాటున బెజవాడ వస్తే మా ఎడ్రసుకి రా' - ఓ కాగితం అందించింది హారతి. తలెత్తి ఆమెకేసి చూసాడు - ఓక్షణం గడిచాక - ఆమెని దగ్గరకి లాక్కుని — ఆమె పెదాల్ని స్పృశించాడు......బయటికి బరువుగా నడిచాడు భాస్కర్. ...

గేటుదాకా అతన్ని సాగనంపటానికి వెళ్ళింది హారతి - ఏదైనా మాటాడటానికి మాటలే కరువైపోయాయనిపించింది వారికి - ఆఖరికి హారతి నోరుపెగిలి వచ్చినమాటలు ... 'అప్పుడప్పుడు వుత్తరాలు రాస్తూండు ... కొంత సుదేటకెళ్ళొచ్చాక ఒంటిబిడ్డో వుత్తరం రాస్తావ్ కదూ ... ...

టాక్సీలు - కార్లు - ఆటోరిక్షాల రణగొణధ్వనుల మధ్యలో - ఇంకా ఏదో అంటోన్నా హారతి మాటలు నలిగిపోయి - శూన్యంలో కలిసాయ్ ...!



గ్రంథస్వీకారం :—

మన రాజకీయాలు - శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

దక్షిణానిలము - శ్రీ ఎమ్మనూరు చిన్నవెంకటరెడ్డి

రామప్ప - శ్రీ సి. నారాయణరెడ్డి.

వ్యాసము:

# కవిరాజు – జీవిత విశేషాలు

— శ్రీ త్రిపురనేని సుబ్బారావు

'యదా యదా హి ధర్మస్య-గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య-తదాత్మానం సృజామ్యహం ॥'

'ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ ధర్మానికి గ్లాని సంభవిస్తుందో ఆయా సమయాలలో, ఆయా చోట్ల నేను జన్మిస్తూ ఉంటాను' అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. దీన్నే మరో విధంగా చెప్పాలంటే 'ధర్మోద్ధరణకూ, న్యాయ పాలనకూ, మానవతకూ, సత్యానికి అవరోధం కలిగినప్పుడు, దాన్ని తొలగించడానికి ఒక నాయకుడు ఆవిర్భవిస్తూ ఉంటాడు. ఉన్నతస్థానము నుండి చ్యుతమైన సమాజాన్ని పునరుద్ధరించి తన అవతారాన్ని విరమించుకొంటాడు. అలాంటి వారందరూ భగవంతులే కానవసరంలేదు. భగవదంశ వారిలోనూ ఉండే ఉంటుంది. అటువంటి మహనీయులందరూ ఈ కోవలోకే వస్తారని శ్రీ కృష్ణ భగవానుడు గీతలో చెప్పిన శ్లోకానికి విపులార్థం!

ప్రతి తరమూ తనకు కావలసిన నాయకుణ్ణి తనే సృష్టించుకొంటుంది. సమకాలీన సామాజిక [illegible] రాజీపడలేని విప్లవ హృదయ [illegible], సంఘంలో పరిణామాలు తెచ్చి కొత్త మార్గాలు చూపుతుంది. తనలోని కుళ్ళును తనే భరించలేని సమాజం తనలో నుండే ఓ నాయకుణ్ణి ఎన్నిక చేసుకొని అతని చేత జాశితం చేయబడుతూ ఉంటుంది. అవతార పురుషులూ, కారణ జన్ములూ అనదగిన బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, మహాత్మాగాంధీ, రాజా రామమోహన రాయలు, వీరేశలింగం, గిడుగు, గుడిపాటి, త్రిపురనేని రామస్వామి చౌదరి గార్లు ఈ కోవలోకే వస్తారు.

సంస్కర్తలూ, మహనీయులూ అయిన ఈ వ్యక్తులు సరిగ్గా సమయాని కావిర్భవించి నాటివారి విమర్శలకు గురియై భావితరాలవారి నమోవాకములందు కొంటున్నారు.

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి స్వగ్రామం కృష్ణా జిల్లా

రామస్వామిగారు జన్మించే నాటికి మనదేశం ఒక ప్రక్క పరదేశీయుల పాలనలోనూ మరో ప్రక్క—మౌఢ్యాంధకారంలో మునిగి ఉన్న ఇతర జాతుల మీద అగ్రజాతుల నిరంకుశత్వంతోనూ క్రుంగిపోతూవుంది. రామస్వామి గారి బాల్యం అంగలూరు, గుడివాడ, బందరులలో గడిచి పోయింది. నాలుగో ఫారం చదువుచుండగానే కవితావ్యాసంగం ప్రారంభించారు. చిన్నతనంలో చదువు మీద ఎంత శ్రద్ధ జూపెట్టేవారో, ఆటలపై అంతగా ఆసక్తి కనపరచేవారు. ఫుట్ బాల్ అత్యద్భుతంగా ఆడేవారు. కవిత్వ విషయంలోనూ, సంస్కృతాధ్యయనంలోనూ అష్ట కష్టాలూ పడ్డారు. ఎవరి వద్దకు వెళ్ళినా నీవు శూద్రుడవు-సంస్కృతం (దేవభాష) అభ్యసించ గూడదు' అని తిరస్కరించారు. కట్టకడకు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి శిష్యత్వం లభించింది. రామస్వామిగారి మీద వర్ణింప నలవిగాని వాత్సల్యం గలిగింది వేంకట శాస్త్రిగారికి.

ప్రథమ ప్రపంచ మహా సంగ్రామపు రోజుల్లో ఉన్నత విద్యాభ్యాసం కొఱకు ఇంగ్లండు ప్రయాణం కట్టారు. వెళ్ళబోయే ముందు ఎవరో తుమ్మినా ప్రయాణం ఆపకుండా బయలు దేరి వెళ్ళారు. లండనులో గాంధీ జీని దర్శించారు. అచటినుండే శర పరంపరగా వ్రాసి పంపిన వ్యాసాలు 'కృష్ణా పత్రిక' లో అచ్చయినాయి. విదేశాలలో ఉన్నా వేషంలో మార్పుండేది గాదు. ఎక్కడున్నా తలపాగా ధరించే వారు. బ్రిటిషుదీవుల్లో మూడు సంవత్సరాలున్నా టొమేటోలు, దోసకాయ ముక్కలు మొదలగు సాత్వికాహారాన్నే భుజించేవారు. మద్య మాంసాల జోలికి పోని మహామనుడు. డబ్లిన్ (ఐర్లెండ్) లోని జాతీయ కళాశాలలో చేరి ఒక డిగ్రీని పొందడానికి ప్రయత్నించారు. కాని తల గుడ్డ పెట్టుకొని తరగతిలో కూర్చో గూడదని ప్రిన్సిపాల్ పట్టు పట్టడంతో చదువుకే స్వస్తి చెప్పారుగాని, తల పాగా తీయడాని కేమాత్రం అంగీకరించలేదు. ఐర్లెండు నుండీ అంగలూరుకు ఉత్తరాలు రాస్తుండేవారు. ఆ ఉత్తరాలను బట్టి చూస్తే పురాణాలకు వ్యతిరేకంగానూ, దేవుడూ దయ్యాలూ లేవనీ, అగ్రజాతికి ప్రత్యేక హక్కులుండ రాదనీ ప్రచారం చేసినట్లు తెలుస్తున్నది. ఐర్లెండు వదలి వెళ్ళి, ఇంగ్లండులో బారిష్టరు పట్టా పొందారు. ఇంగ్లడు ముఖ్య పట్టణాలు, ఉత్తర దక్షిణ ఆఫ్రికాలు, సింగపూరు, సిలోన్ మొదలైన దేశాల్లో పర్యటించారు. విదేశాల్లో ప్రయాణం చేసేటప్పుడు హోటళ్ళలో 13 నెంబరు గదిలో బస చేసే

ధైర్యంతో ముందడుగు వెయ్యి' అంటూ కావలసిన ధైర్యాన్నీ, స్థైర్యాన్నీ సరఫరా చేసేవారు చౌదరిగారు. ఆకాశమంత మనిషి సముద్రమంత ధైర్యం అందిచ్చాడన్న సంతోషం వారిని పునరుజ్జీవితులను చేసేది.

చౌదరిగారు శతావధానులు. చక్కని మాటకారి. 'రిటార్టు' అనే శక్తి వారిలో అపారంగా ఉంది. అందుచేతనే సంభాషణలో ఎంత వాణ్ణయినా కొద్ది క్షణాల్లోనే బోల్తా గొట్టించేవారు. ఎదుటి వారికి కలకాలం జ్ఞాపకం ఉండేలా జవాబు లివ్వడం చౌదరిగారికి వెన్నుతోబుట్టిన విద్య. చౌదరిగారి అవధానాలను గురించిన కథలు ఈనాటికీ ప్రజలు అగుబ్బుగా చెప్పుకోవడం కద్దు.

చౌదరిగారు బహు గ్రంథకర్తలు. సూతపురాణం, కురుక్షేత్ర సంగ్రామం, శంబుకవధ, ఖూనీ, వివాహ విధి, కుప్పుస్వామి శతకం, ధూర్త మానవా! సూతాశ్రమ గీతాలు, భగవద్గీత-వీరి ముద్రిత గ్రంథాలు. చౌదరిగారి భాషా సేవకు అలరిన ఆంధ్ర మహాసభ 'కవిరాజు' బిరుదాన్నిచ్చి తనను తనే గౌరవించుకొంది. గుడివాడ పౌరులు చౌదరిగారికి చిత్రభాను వైశాఖంలో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానం జరిపి, వారి సంస్కరణోద్యమం పట్ల తమ గాఢానురాగాన్ని తెలియజేసుకొన్నారు. వివిధ ప్రాంతాలనుండి అనేక మంది ప్రముఖులు, వేలాది స్థానిక ప్రజలు ఆ సన్మానంలో పాల్గొని కవిరాజుకు బ్రహ్మరథంబట్టారు. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారి ఆధిపత్యంలో, చల్లపల్లి సంస్థానాధీశ్వరులు మున్నగు మహామహుల సమక్షంలో, పండితాశీర్వాదాలతో, అనేక మంది కవుల అభినందనలతో అఖండవైభవోపేతంగా ఆ సన్మానం జరిగింది. ఆనాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో పెద్దనాది మహాకవులకూ జరిగిన సన్మానాలను అతిశయించిన ఈ కవిరాజు సన్మానాన్ని జూచిన ఆంధ్రలోకం హర్షోత్పులకితమైంది. సన్మానం సంచికలో మొత్తం 82 మంది కవులు, రచయితలు కవిరాజు ప్రతిభను, వారి సాహిత్య సాంఘిక సేవలను ప్రశంసించారు.

కాల చక్రం గిఱ్ఱున తిరిగి సన్మానం జరిగి కొన్ని మాసాలు గడిచాయి. ఆహ్వానించబడ్డ ప్రతి సాహిత్య సభకూ వెళ్ళడంతో చౌదరిగారికి అస్వస్థత గలిగింది. అది విషజ్వరానికి (టైఫాయిడ్) దారి దీసింది. ఆ రోజు కారోజు చౌదరిగారి ఆరోగ్య స్థితి ప్రజానీకంలో అమితాందోళనను

కలిగించింది. ఆంధ్రుల దురదృష్టం కొద్దీ, ఎట్టకేలకూ మహాకవి, యుగ పురుషుడైన రామస్వామి చౌదరిగారు తెనాలిలోని వారి స్వగృహంలో 1943 సం. జనవరి 16 వ తేదీ రాత్రి గం. 1—30 ని. లకు మహేశ్వరునిలో విలీనమయ్యారు. ఈ ఆకస్మిక వార్త యావదాంధ్ర ప్రజానీకాన్ని దుఃఖ సాగరంలో ముంచివేసింది. అప్పటికి చౌదరిగారి వయస్సు 56. సంవత్సరాలు.

మరుసటి రోజున (జనవరి 17 వ తేది) కవిరాజు నిర్యాణం పట్ల నిరసన సూచకంగానో యనునట్లు రవిరాజు ఆలస్యంగా ఉదయించాడు. తెనాలి పట్టణ ప్రజలకూ, సమీపాననున్న గ్రామీణ ప్రజానీకానికీ విషాదచ్ఛాయల ముసుగు విడివడ లేదు. కవిరాజు భౌతిక దేహం పుష్పమాలలచే అలంకరించబడి తెనాలి పుర వీధుల గుండా బ్రహ్మాండమైన ఊరేగింపుతో స్మశాన వాటికకు తీసికొని పోబడింది.

(సశేషము)

# కీ. శే. యెర్నేని లక్ష్మీనారాయణ చౌదరి

శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య



శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు సెప్టెంబర్ 5 వ తేదీన దివంగతులయినారను పిడుగువంటి వార్త మా దక్షిణ భారత హిందీ ప్రచార సభ హైదరాబాదు కార్యాలయానికి చేరినది. ఆకస్మికముగ యీ వార్తను వినిన సభ కార్యకర్తలందరు నిర్విణ్ణులైనారు. ఇంతకు నెలరోజుల ముందు హైదరాబాదు వచ్చి మా కార్యాలయములోనే బస చేసి వెళ్లినారు. ఇక్కడ సభ కార్యాలయంలో ఉన్న డాక్టర్ గిడుగు వెంకట సీతాపతి గారి యింట ఆతిథ్యము పుచ్చుకుని, 14-7-60 తేదీన వారికి తమ కృతజ్ఞతను తెలుపుచూ యీ వాక్యములు వ్రాసిరి.

'మీ నుండి వచ్చిన తరువాత మాతోబుట్టువు స్వర్గస్థురాలగుటచేతను, యితర తొందర పనులచేతను నా కృతజ్ఞతను వెంటనే తెలుపుకొనలేనందుకు దయతో మన్నించగోర్తాను——ప్రేమతో నాపై చూపిన యాదరాభిమానములకు యిచ్చిన ఆతిథ్యమునకు యెంతయో కృతజ్ఞుడను ——'

ఈ లేఖలో వారి సౌజన్యము, మిత్రుల యెడ వారికిగల కృతజ్ఞతా భావము వెల్లడగుచున్నవి.

శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు ఆంధ్రదేశములోని హిందీ ప్రచారోద్యమమునకు చేసిన సేవ అపారము. ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము విజయవాడలో 1936 సం॥న స్థాపింపబడినది. ఆ సంఘమును స్థాపించిన నాటనుండి వారు దానికి కోశాధ్యక్షులుగ ఉండి అత్యంత శ్రద్ధతో సంఘాభివృద్ధికి తోడ్పడిరి.

విజయవాడలో కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు స్మారక చిహ్నముగా నిర్మింపబడిన శ్రీ నాగేశ్వరరాయ హిందీ భవన నిర్మాణమునకు వీరెంతయో తోడ్పడిరి.

విజయవాడలో మాచవరము వద్ద హిందీ ప్రచారక విద్యాలయమునకు స్థలము కొనుటలోనూ అందు భవనము నిర్మించుటకు గూడ వీరే శ్రద్ధ తీసుకొనిరి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ రజతజయంతి ఉత్సవములు 1946 లో శ్రీ గాంధీ మహాత్ముని అధ్యక్షతన జరిగిన నాడు రజత జయంతి నిధికి రూ. 1116/= శ్రీ లక్ష్మీనారాయణ చౌదరిగారు విరాళము నొసగి తమ ఔదార్యమును చూపిరి. శ్రీ చౌదరిగారు ఖద్దాధి కారి, నిరాడంబర జీవి, మిత్రులకు, బంధువులకు వారు ప్రేమ పూర్వకముగా యిచ్చిన ఆతిథ్యము మరువరానిది.

గాంధీ మహాత్ముని యందు, వినోబాభావే యందు అపారమైన భక్తి శ్రద్ధలు గలవారు. గాంధీ మహాత్ముని నిర్మాణ కార్యక్రమములో పాల్గొనే కార్యకర్తలు— హిందీ ప్రచారోద్యమ నాయకులు, ఖాదీ ప్రచారకులు, సర్వోదయ కార్యకర్తలు మొదలగు వారందరు వార్ధా, అలహాబాద్ మొదలగు ఉత్తర రాష్ట్రములనుండి వచ్చే వారందరు వీరింట బసచేసి వీరి ఆతిథ్యమును స్వీకరించినవారే. విజయవాడలో సర్వోదయ సమ్మేళనము 1955 లో జరిగినపుడు వీరింటనే అతిథులందరకు ఆతిథ్య మొసగ బడినది. కాంగ్రెస్ కార్యకర్తలకు వీ రెంతయో సహాయము చేసిరి.

హిందీ విద్యాలయమునకు విజయవాడలో తగిన భవనమును నిర్మించవలయునని వారికి సంకల్పముండెను. అందు కొరకు వారు స్థలమును కొనవలయునని ప్రయత్నము చేసిరి. కాని యింతలో హైదరాబాద్ నగరము రాజధానిగా ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడుట జరిగినది. ప్రధాన కార్యాలయమును హైదరాబాదుకు మార్చుటచే వీరి సంకల్పము నెరవేరలేదు.

హిందీ ప్రచారోద్యమ అభిమానులు, శ్రీ చౌదరిగారి యందు భక్తి శ్రద్ధలు గల వారున్ను విజయవాడలో శ్రీ లక్ష్మీనారాయణ చౌదరిగారి స్మారక చిహ్నముగా హిందీ మహా విద్యాలయమును, భవనమున్ను, నిర్మించి వారి సంకల్పమును నెరవేర్చగలరని భాషాభిమానులను ప్రార్థించు చున్నాము, శ్రీ చౌదరిగారి కుటుంబమునకు మా హృదయ పూర్వకమైన సాను భూతి తెల్పుచున్నాము.

శ్రీ చౌదరిగారి ఆత్మకు భగవంతుడు శాంతిని చేకూర్చుగాక అని ప్రార్థించు చున్నాము.

---

ప్రవంతి

వార్షిక చందా రు. 4.00

విడిప్రతి ,, 0.35

## వార్తలు:

### కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు డా. శ్రీమాలి సభ కార్యాలయ సందర్శనము

ది 24–9–60న కేంద్ర విద్యాశాఖా మాత్యులు డాక్టర్ కే. ఎల్. శ్రీమాలి గారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ – ఆంధ్ర, హైదరాబాదు కార్యాలయమును, దక్షిణ భారత్ ప్రెస్‌ను సందర్శించిరి. ఆ సందర్భంలో స్వామీ రామానంద తీర్థ గారి అధ్యక్షతను సభ జరిగినది.

కేంద్ర సభ సంయుక్త కార్యదర్శి శ్రీ ఉన్నవ రామగోపాల కృష్ణయ్యగారు స్వాగత మొనర్చి కార్యకర్తల పరిచయ మొనర్చిరి.

ఆంధ్ర సభ కార్యదర్శి శ్రీ భాలచంద్ర ఆప్టే గారు స్వాగత పత్రము సమర్పించిరి. స్వాగత పత్రంలో ఆంధ్ర ప్రాంతంలో జరుగుతున్న హిందీ ప్రచార కృషిని, ఆంధ్ర సభకు సంబద్ధమై పనిచేస్తున్న హిందీ ప్రేమి మండలుల, మహా విద్యాలయముల, ప్రచారకుల వివరాలను, హిందీ ప్రచారానికి ఇంకనూ చేయవలసిన కృషిని వివరిస్తూ ఇప్పుడు ప్రభుత్వం సభకు చేస్తున్న సహాయం చాలదనీ, దానిని ఎక్కువ చేయాలనీ కోరబడింది.

డా శ్రీమాలి దక్షిణ భారత హిందీ ప్రచార సభ చేస్తున్న కృషిని ప్రశంసిస్తూ "విద్వేషాలు లేకుండా సమన్వయ దృష్టితో హిందీ వ్యాప్తికి కృషి చేయాలి. ఆంగ్లం అంతర్జాతీయ భాష. దానికున్న స్థానం వేరు. యూరోపులోని కొన్ని దేశాల్లో ప్రతివారూ మూడు నాలుగు భాషలు నేర్చుకొంటారు. అలాగే మనం నేర్చుకోవచ్చు. ఏమంత కష్టం కూడా కాదు."

"ప్రాంతీయ భాషలను, రాజభాషయగు హిందీని పరిపుష్టం చేయటానికి కేంద్ర ప్రభుత్వం ఎంతో కృషి చేస్తున్నది. పారిభాషిక, సాంకేతిక పదాలు భారతీయ భాష లన్నిటిలో ఒకేరకంగా ఉండటం చాలా మంచిది. ఆ విధంగా అన్ని భారతీయ భాషలకు సరిపోయేలా పారిభాషిక, సాంకేతిక పదాలను తయారు చేయటానికి ఒక నిపుణుల సంఘం ఏర్పాటుచబడింది" అన్నారు.

స్వామీ రామానంద తీర్థ ప్రసంగిస్తూ "దక్షిణాదిలో హిందీ నేవిధంగా నేర్చుకుంటున్నారో అదే విధంగా ఉత్తరాదివారు కూడా దక్షిణాది భాషల్లో ఏ ఒక్కదానినైనా నేర్చుకోవాలి. దీని వల్ల సామరస్యభావం ఏర్పడుతుంది" అన్నారు.

జాతీయగీతంతో సభ ముగిసింది.

**పుస్తకపరిచయము :**

# చైతన్య రేఖలు

కర్త :
శ్రీ జె. బాపురెడ్డి
25 ఖండికల సంపుటి. వెల : రూపాయి

ప్రతులకు :
ఆంధ్రా బుక్ హౌస్,
సుల్తాన్‌బజారు, హైదరాబాదు

"నాలో పూచిన చైతన్య రేఖలను గూర్చి" అని బాపురెడ్డిగారే అన్నారు. పుస్తకానికి చైతన్య రేఖలు అని పేరు పెట్టడం బావుంది.

ఖండకావ్యంలోని వస్తువు కవి యొక్క ఒకానొక అనిర్వాచ్య మనో దశలోని అనుభూతి విశేషమని తెలిసినవాళ్ళు చెపుతారు. ఆ అనుభూతి అందుకున్నంత, ఆనందించ గలిగినంత ప్రతివారికి రుచించేదే. ఆ అనుభూతిని యెంత చేరువగా తెచ్చుకో గలిగితే అంత ఆ కావ్యానికి హృదయంలో అస్తిత్వం వుంటుంది. కదిలించేది అంటే హృదయాన్ని స్పృశించేదే కవిత్వమనీ దీని యొక్క స్థాయి భావమే ఆలంకారికులు నిర్వచించే సద్యః పరనిర్వృతి అని చెప్పవచ్చునేమో!

ఖండకావ్యంలో నగిషీ పనులూ, రసవిభావాదులూ, పాండిత్యమూ మొదలైనవి ప్రదర్శించేందుకు అనువుగా వుండవు. అందువలన ఖండకావ్యానికి హృదయం గీటురాయి. అంటే మహాకావ్యానికి కాదని యేమీ కాదు. ఒకానొక విమర్శక కవి అన్నారు; పద్యాన్ని రాగయుక్తంగా చదివితే శ్రవణసుఖమైనా కలుగుతుందని. వచనగేయానికి అలాటి యోగ్యతైనా యేదీ! సూటిదనమూ, హృదయాన్ని తాకే నేర్పూ వుంటే గాని దాన్ని హర్షించలేము. ఇందులో మంచి వచన గేయం ఒకటి వుంది.

ఒక మబ్బు, గడ్డిపువ్వు, ఆకాశంలో హరివిల్లు ఎండిపోయిన చెట్టు, అర్ధరాత్రి దూరంగా కుక్క అరపు, మంచు కురిసిన రాత్రీ అందరి హృదయాలలోనూ ఒకే రకమైన స్పందనను కలుగ చెయ్యలేవు కదా! అందుకే ఆ అనుభూతి దూరమైన వాళ్ళకు ఖండకావ్యం రుచించదు. వారి బుద్ధి తక్కిన కావ్యగుణాలను ఆశ్రయించవలసి వస్తుంది.

అలాంటి అనుభూతి ప్రధానాలైన ఖండికలు యీ సంపుటిలో చాలా వున్నాయి.

ఇందులోని గీతాలన్నీ బావున్నాయనటం, విశేషించి చెప్పినట్లు యేమీ కాదు. కొన్ని గీతాలు చాలా బావున్నాయని చెప్పటం అలంకారికంగా చెప్పినట్లు అసలు కాదు. అచ్చమైన భావుకత్వం ఈ గీతాల్లో కన్పిస్తుంది. అయితే శబ్దాలను ఇంకా అందంగా కూర్చటం అవసరం. కొన్నికొన్ని భావుల మరిన్ని పదాల
[illegible] పాఠకుడి

దృష్టికి అన్యాయం అనిపించక పోవచ్చును. "మానవుడె సురుడుగా కన్పడు" మొదలైనవి. రమణీయార్థము (లు) ను ప్రతిపాదించు శబ్దము కావ్యమనిగదా పెద్దల నిర్వచనం సందేహావీచి అన్నగీతంలో "ఈ రూప సౌందర్యమే తమసిగలి యునో" అన్నచోటా "కమలకన్య వరింతునా" అన్నచోట శబ్ద సాధుత్వా-సాధుత్వాలతో పని లేదు, శ్రుతిసుభగత్వం కన్పించటం లేదు. అయితే యీ కావ్యం చదివి ఆనందించటానికి ఇలాంటి చిన్నచిన్న మాటలు యేమీ అడ్డంకులు కావు. అనింద్య, పరీక్ష, ఉగాదిలాంటి గీతాలు యెప్పటికీ రుచించేవే. తృప్తినీ ఇచ్చేవే.

పద్య నిర్మాణానికి పాటుబడినట్లు కన్పించక పోవడం బాపురెడ్డిగారిలో వొక ప్రత్యేకత. అంటే అందమైన పద్యాలు యీ చిన్న సంపుటిలో వున్నాయని. "ఎన్ని వసంతముల్ గడిచె" అన్న పద్యమూ, "ఎద కదలించు నట్టితర లేక్షణలన్ గురియించి..." అన్న పద్యమూ, ఉదాహరణంగా చెప్పవచ్చును.

ఇందులో అన్ని రకాలైన ఇవాల్టి కవిత్వపు రుచులూ, పాకాలూ వున్నాయి. మాత్రాచ్ఛందస్సులూ వున్నాయి. వచన గీతాలూ వున్నాయి. భవిష్యద్దర్శనము, అజేయుడు మొదలైన గీతాల్లో కవికున్న ఆత్మవిశ్వాసం ద్యోతక మవుతున్నది,

అభ్యుదయ కవిత్వ ప్రవక్త చెప్పినట్లుగా యీయన గారూ కవితామయమే నోయ్ అన్నీ అని కుక్కపిల్లను కావ్య వస్తువుగా చేసుకున్నారు. అన్నీ కవితా మయం చేసేందుకుపపడనువేదీ అవసరం లేదు. స్పందించే హృదయం వుంటే చాలును. "మనుషు లనబడేవాళ్ళ కంటే నీకే, ఓ నమస్కారంచేయా లనిపిస్తుంది—"

అన్న వాక్యాలు బావున్నాయి.

నిన్నుచూసి లోకం నేర్చుకోవలసింది
నిజంగా ఎంతైనా ఉంది
నాకు మాత్రం నిను చూస్తే
నమ్ము బాధా కరంగా ఉంది,

అన్న వాక్యాలు కుక్క పిల్లనీ కావ్యవస్తువుగా చేసుకునే పరుసువేదిలాటి స్పర్శగుణం యీయన లేఖినికి వుందని పిస్తునూ వున్నది.

కాశ్మీరదేశాన్ని "ఇలా రమణి పెదవులపై, వెలిగే దరహాసంగా పోల్చటం" అచ్చపు కవి హృదయానికి తెనిగింపు, "ఈప్స" "దాసోహం" మొదలైన గీతాలలో యీయనగారి మీద ఇవాళ పేరుపడ్డ కొంతమంది ప్రభావం కన్పిస్తోన్నది. అది అంతమంచిది కాదు. నెలపాత్ర, చాంద్రీపాత్రిక, లాంటి మాటల బొమ్మలు మెఘిటోగా వున్నాయి.

"మృత్యువు" "అనుతాపము" "తుభితాత్మ" మొదలైన గీతాలందు యీయన గారి అంతర్ముఖత్వం గోచరిస్తుంది. చిట్టచివరి గీతంలో కృష్ణవేణికి సాంత్వనము పలుకుతూ, ఆశగా, ఆనందంగా, ఆత్మ పరీక్షతనూ, చింతలోను భవిష్యత్తును గురించీ, గడచిపోయిన కాలాన్ని గురించీ పాడుకున్నారు.

ఈ ఖండ కావ్య సంపుటి శ్రీ సి. నారాయణరెడ్డి గారికి అంకితం. నవ్య సాహితీ సమితి వారు దీనిని తమ అనుబంధ ప్రచురణగా వెలువరించారు.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆశీస్సులనిస్తూ బాపురెడ్డికి సహజంగా కవితా శక్తి కలదన్నారు. దానికి 'ఇందలి ఖండికలలో అచ్చటచ్చటలోనే మెరుపులే తార్కాణ' మనీ అన్నారు.

బాపురెడ్డిగారు అభ్యుదయ పరంపరాభివృద్ధిగా, కావ్య రచన చేస్తారని ఆశించవచ్చును.

"......సాహిత్యంలో కృషిచేసి, నిర్దుష్టములు, గుణశోభితములు, రసవంతములు అయిన కావ్యాలు వ్రాసి......" ఇవి మల్లంపల్లి వారి ఆశీః.

ఇదే అందరి ఆశయమున్నూ.

— మంజుశ్రీ

# కృష్ణకథా విపంచి

రచన : ప్రతులకు :

శ్రీ బాదాల రామకవి రచయిత, ఆంధ్రోపన్యాసకుడు

వెల : రు. 3/- యువరాజ కళాశాల, మైసూరు

కృష్ణదేవరాయలవారు కథానాయకులుగా పదాశ్వాసములలో వ్రాయబడిన కావ్యమిది. కథ విపంచి రూపము. ఆశ్వాసములు రాగరూపములు. కవిగారికి సంగీతమునందు ప్రవేశము, ఔత్సుక్యము నున్నట్లున్నవి. ఆశ్వాసములకు ఆనంద భైరవి' 'అఠాణ' అని రాగముల పేర్లుంచి సాధించిన పరమ ప్రయోజనము లేనట్లుగా శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు మున్నుడిలో వ్రాసినారు.

మొదటి ఆశ్వాసము అసావేరి. ఇందులో యుద్ధము తప్పించుకొని పిలు

వర్షిణి రాయలవారు పెద్దన్నగారిని గండపెండరమిచ్చి గౌరవించుట. ఆనంద భైరవి పేరిట మూడవ ఆశ్వాసములో రాయలవారు చిన్నాదేవికొరకు, ఆమె ఆయనకొరకు పగులబడిపోవుట - విరహవేదన - రాయలవారు ధైర్యముచేసి అర్ధ రాత్రి ఆమె వద్దకు పోవుట - తిరిగి వచ్చుచుండగా అప్పాజి రాయలవారి కంట బడుట — రాయలవారు తన హృదయములోని చిన్నాదేవియందలి యనురాగ మును అప్పాజికి తెలుపగా ఆయన ముందు తిరుమలదేవిని వివాహమాడి తరువాత చిన్నాదేవిని చేసికొమ్మనుటయు రాయలవారట్లు చేసికొనుటయును, కదన కుతూహలము చతుర్థాశ్వాసము. ఇందులో అప్పాజి, రాయలవారు యుద్ధావ సర సన్నాహములను చేసికొని విజయయాత్రకు బయలుదేరుట. పంచమాశ్వా సము హంసధ్వని. రాయలవారు విజయులై తిరిగి వచ్చెను. వచ్చి ముందుగా కవి పండితులను కలుసుకొని తనకు ఆరాధ్య విష్ణువు దర్శనమగుటయు ఆయన విష్ణు చిత్తీయము వ్రాయుమనుటయు తాను పూనుకొనుటయు ఇత్యాదులు చెప్పి తరు వాత రాజసభకుపోయి తను జయించివచ్చిన దుర్గములకు తన ప్రతినిధులుగా నుండదగినవారిని నియమించుట. షష్ఠాశ్వాసమైన "అఠాణా" లో కళింగయుద్ధ సంబంధి వర్ణనము, తదనంతరము శ్రీకృష్ణరాయలు ఇలువేలుపైన వేంకటేశ్వ రుని దర్శనమునకు తిరుపతికి పోయి స్వామిని స్తుతించుట. చివరి యాశ్వాసము కల్యాణి. భువన విజయ సభా సందర్శనము - కృష్ణపండితుని వీణాగానము - నృత్యము - మనుచరిత్ర కృతిప్రదానము - గజపతి కూతురుతో రాయలవారి వివాహము — ఇది కావ్యములోని కథా స్వరూపము.

చారిత్రక కావ్యములు వ్రాయునపుడు కొంత శుష్కముగా నుండక తప్పదు. అది ఆ వస్తువులోని గుణము. శ్రీరామ కవిగారు సాధ్యమైనంతవరకు పద్యరచనా ప్రవాహములోని వేగమువలన నా శుష్కతను మాపుచేసిరి. కేవ లము పద్యములు వ్రాయగలుగుటతో కావ్యము వ్రాయుట పడదు. ముందు కథావస్తు సంగ్రథన మున్నది. తరువాత నిర్వహణము 'అమృతవర్షిణి' లోని రాయలవారు చేసిన యోగికిని కవికిని గల భేద నిరూపణము—'కల్యాణి' లోని పోర్చుగీసు వేయను రాయలవారిని పొగడుట కొంత అసందర్భముగను — ఔచిత్యమునకు దూరముగ నున్నవి. పెద్దనామాత్యుని యొక్కయు — తిమ్మన్న యొక్కయు రాయలవారికి సంబంధించిన పద్యములను శ్రీరామకవిగా రుచిత ముగా నుపయోగించుకొనిరి. ఈ నేటి కాలమున జాతీయోద్యమమున కంతర ముగా బహుళ ప్రచారమునకు వచ్చిన ఊహలు — హానికరమైన శబ్దములు శ్రీరామకవిగారు రాయలకాలమున కంటగట్టినారు.

పల్లెయే భారతీయుల భాగ్యవల్లి

పల్లెయే దేశమాతకు ప్రాణపదము
పల్లెయే లేక ర్యాజాలు బ్రతుకగలవె ?

ఇత్యాదు లున్నవి — మహోదాత్తముగా భావింపగల నేర్పు శ్రీరామకవి గారి కున్నది. చిన్నమదేవి రాయలను దరిసి ఆయన ఎదలో దూరినది "విడని బంధంబులన్ విడిపించుకొని పరమాత్మలో జేరు జీవాత్మ వోలె"నట —శ్రీరామ కవిగారికి మంచి ధారాశుద్ధియున్నది. ఊహాలున్నవి. కథా నిర్మాణశక్తి ఔచిత్యము నెరిగి వ్రాసెడి బుద్ధి పెంచుకొన్నచో ఒక మహాకావ్య రచయిత నిస్సందేహముగా కాగలరు.

— క్షేమేంద్ర

# ఛలకతే ఆంసూ ఫిర్ చునౌతీ

## (చిందుతున్న కన్నీరులు ఆపై ఒక సవాలు)

ప్రచురణ కర్తలు :                    రచన : శివదయాళు 'భ్రమర్'

దక్షిణవాణీ ప్రకాశన్,
సుల్తాన్‌బజార్ హైదరాబాదు,
వెల : రెండు రూపాయలు.

ఇది హిందీ కావ్యం. హిందీ భాషీయులు, ప్రస్తుతం హైదరాబాదు నివాసిగా ఉంటున్న శివదయాళు భ్రమర్ గారు దీన్ని రచించారు. తెలుగుపత్రికలో హిందీ కావ్యాన్ని సమీక్షించడం కాబట్టి హిందీని గురించి రెండుమాటలు చెప్పడం అప్రస్తుతం కాదు. హిందీ సాహిత్యం అల్పకాలికమైందనీ దాంట్లో సాహిత్యం మంచిది లేదనీ ఒక గాలి ఉంది. ఈ విషయాన్ని కొంచెం విశాలంగా చూడాలి. పూర్వకాలంలో గాని వర్తమానకాలంలో గాని హిందీ సాహిత్యం ఒక భాషకు సంబంధించింది కాదు, ఒక భూభాగానికి సంబంధించింది. తులసీదాసు, సూరదాసు, మీరాబాయి, కబీరు, విద్యాపతులు ఒక భాషలో ఉండి వ్రాశారని చెప్పడంకంటె ఒక సంస్కృతిలో, ఒక కుటుంబంలో ఉండి వ్రాశారని చెప్పడం మంచిది. ఆయా భాషల్లో చిన్న చిన్న రూపభేదాలు ఉన్నా వారాశించిన, వారు తమ తమ కావ్యాల్లో రూపొందించిన జాతీయ జీవితమంతా ఒకటి. ఆ కావ్యాల్ని అవి చదువు [illegible] — [illegible] కలిపి మనం హిందీ

భాషీయులు అంటాము. ఆ హిందీ ప్రాంతంలో ప్రాచీనకాలంలో ఉన్న ఈ ఏక కుటుంబకత్వం, ఏక జాతీయ జీవిత విధానం వర్తమానకాలంలో కూడా అనుస్యూతంగా వస్తుంది. అందువల్ల హిందీ సాహిత్యానికీ తతిమ్మా సాహిత్యాలకూ ఒక మౌలికమైన భేదముంది. తతిమ్మా సాహిత్యాలు భాషా ధారకాలు అయితే హిందీ సాహిత్యం జాత్యాధారకం. కాబట్టి హిందీభాష జాతీయభాష, హిందీ సాహిత్యం జాతీయ సాహిత్యం. కాలప్రవాహంలో ఎక్కువ మునకలుతిన్న సాహిత్యం కూడా హిందీ సాహిత్యమే. విజాతీయ సంఘర్షణల వల్ల సాహిత్యంలో కదలిక వస్తుంది. జాతిపోరాటాల్లో నుంచి హిందీ సాహిత్యం పుట్టింది. రాసోగాథలలో వస్త్వాలంబనం పొంది కాలక్రమేణా ఎన్నో రకాలైన ధార్మిక రాజకీయవైవిధ్యాలను సంతరించుకుంది. వెనుకటికాలంలో సూఫీవాదం వచ్చినా ప్రస్తుత కాలంలో హాలావాదం వచ్చినా ఇట్టి పరిణామమే. ఈ విదేశీయ సంఘర్షణలతో పాటు ప్రాచీన భారతీయ విద్యాపీఠాన్ని పరిశీలించి మథించి పునహా ఆధునిక భారతీయ జీవితంగా దాన్ని మలచిన ఉద్యమాలు కూడా ఆ భూభాగంలో పుట్టినాయి. తత్పరిణామంగా కామాయనివంటి సాంస్కృతిక మహాకావ్యాలు నేటి హిందీకి దక్కినవి. ఈ దృష్టితో చూచినా హిందీ నుంచి మనకు కొన్ని విశేషాలు లభించవచ్చు.

భ్రమర్‌గారి కావ్యంలో భారతీయ సంస్కృతి చిహ్నాలకంటె ఎక్కువ సంతుళిత భారతీయ జీవితమే కనిపించుతుంది. హైదరాబాదులో నిత్యం జరుగుతూ ఉండే కవి సమ్మేళనాలు కొంతమంది అంతర్భాషీయులైన కవులను మనకు ఎరుకపరచినాయి. అందులో భ్రమర్‌గారు ఒకరు. 'చిందుతున్న కన్నీరులు, ఆపై ఒక సవాలు' అనేది ఇటీవల ప్రచురింపబడిన వీరి తొలికావ్యం. త్వరలోనే ఇంకా కొన్ని కావ్యాలు రాబోతున్నాయి. చిందుతున్న కన్నీరులలో ప్రణయవైధుర్యం తాడితమై జీవన సంచలనంగామారి ఆక్రోశంతో నిండి, కన్నీరులను ఒలికించుతుంది. అపారమైన ఓజస్సుతో హృదయం మాటున అణిగియున్న ఆవేదనలను కర్కశ మధురంగా గద్గదింపజేసి ప్రతిపదానికీ పాటనూ ప్రతి పాటకూ అనుభూతిని ఒదిగించారు భ్రమర్‌గారు. తన జీవితాన్ని ఎవరో త్రుంచివేసినట్టు విలవిలమంటున్న కవి ఆర్తనాదం ఈ క్రింది పంక్తుల్లో చూడండి.

"సుఖభోగీ, నా బాధాజీవనవీణా తంత్రిని త్రెంచకుమా !
త్రుంచినవేవో తునిగిపోయినవి ఉన్నవైన కదలించకుమా !
శోక చింతనచ్ఛాయలలో రవళించునేను నను నాగకుమా !

ప్రియుడు తన్నువలచి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయాడు, కవి ఆశించిందొకటి ప్రియుడు ఇచ్చింది వేరొకటి. ప్రియుడు ప్రణయాన్నే ఇచ్చాడు కాని అది శత్రుతుల్యమగు ప్రణయమట.

"నేకోరితి నీ నుండెప్పుడు శత్రుతుల్యమగు ప్రణయమును
అనలమలది పరుగెత్తితివే నీ వలపదెంత దుర్బలము."

కవికి ఈ నిరాశ ఒక లెక్కలోనిదిగాదు, ఆవేగం; ఉన్ముఖయానం, కష్టాలను లెక్క చేయకపోవడం, ఉద్యమశక్తి, అన్నీ కవికి రెక్కలిచ్చి పైపైకి ఎగిరిపొమ్మని ఆవేశపరుస్తున్నాయి,

"దూరగగన మది దూరగగన మతి దూరదేశమే ఖగమా!
ఆకలియని వెనుకాడకు కూలిన నీడముతో పరుగిడుమా"

ఇలాంటి దుస్సాహావేశంలో కూడా "ధ్వంసమున్నదిట నిర్మాణము గైకొని నేనేమి చేతు" నన్ను నిరుత్సాహం తొంగి చూచింది. నిజానికి ఇది నిరుత్సాహం కూడా కాదు. క్రౌర్యాల విలయతాండవంలో క్షోభించే ప్రపంచం ఎప్పటికైనా తన నిర్మాతృశక్తిని స్వీకరించగలదన్న లోలోని ఆశ.

'ఆపై ఒక నవాలు" అనే కావ్యం 'చిందుతున్న కన్నీరులకు' అనుబంధమైన కావ్యం కన్నీరులకు పరిణామం నవాలు. జీవితం మీద విసుగెత్తిన కవి యొక్క గరళ సదృశమైన రోషం ప్రతి అక్షరాన్ని అగ్ని బాణంలా చేసి విసిరింది. దీంట్లో నేను ఒకమాట చెబుతాను మనిషితో కాదు దయ్యంతో" అంటున్నారు భ్రమర్ గారు. "ప్రయాణికుడా! పయనం సాగించు. నీ ఆశ నీ వెంట వస్తుందని కాదు. పడిలేవలేని నీ కాలికి మళ్లీ ఎదురు దెబ్బ ఎప్పుడు వస్తుందా అని" "తుమ్మెదను మధుపాయి, వ్యసని అని లోకం గోలపెడుతుంది. తుమ్మెదకు కుసుమరసం మధువు కాదు, ఆకలిముద్ద. మధువు గ్రోలకపోతే పాపమది ఇంకేం తిని జీవిస్తుంది? కాని లోకం అందరినీ ఇలానే ఆడిపోసుకుంటుంది" అని భ్రమరుగారు ధారణా వైక్లవ్య గీతుల్ని ఆలపిస్తున్నారు. ఈ కావ్యానికి రామనిరంజన్ పాండేయ్ గారు (ఉస్మానియా విశ్వవిద్యాలయ హిందీ శాఖాధ్యక్షులు) ఒక పీఠిక వ్రాశారు. అందులో వారు 'భ్రమర్ కవిత్వంలో నేను మధువునే వెతుక్కున్నాను, కంటకాల సంగతే చూడలేదు." అన్నారు కాని నేను భ్రమర్‌లో మధువుని వెతుక్కోలేక పోయాను. క్రొందీవెను తాకి కదిపి మకరందం చిందిపోగా నిరాశగా చూచి వెగ్గల్లిపోతున్న విషణ్ణఝుంకారమే నాకీ భ్రమరులో వినిపించుతుంది.

— శ్రీ దుర్గానంద్

